SUNDAY MAGAZINE

# ఆదివారం
# ఆంధ్రజ్యోతి

22 జనవరి 2017

mohan
PUBLICATIONS

# 'సెంట్' పర్సెంట్
*life style*

# ‘కాస్ట్యూమ్’ కష్టాలు

కథానాయికలు కడు సుకుమారంగా ఉంటారు. సాధ్యమైనంతగా పొట్టిదుస్తులు ధరించి గ్లామర్ ఒలకపోస్తారు. అయితే అంత సుకుమారులకు కూడా కొన్నిసార్లు ‘కాస్ట్యూమ్’ కష్టాలు తప్పవు. పాత్రను బట్టి కిలోల కొద్దీ బరువున్న దుస్తులు, నగలను ధరించక తప్పదు. విడుదలకు సిద్ధమైన ‘కాబిల్’ సినిమాలో ‘సారా జమానా’ అనే ఐటెమ్‌సాంగ్ కోసం ఊర్వశీ రౌతేల 150 కిలోల బరువున్న కాస్ట్యూమ్ ధరించిందట. పాత్ర చిత్రీకరణ సమయంలో ఆ బరువు మోయలేక చాలాసార్లు కిందపడిపోయిందట. ఇలాంటి కష్టాలే ఇంకొంతమంది హీరోయిన్లకు కూడా గతంలో అనుభవమయ్యాయి. దీపికా పదుకొనే ‘రామ్‌లీలా’లో 30 కిలోల బరువున్న గాగ్రా, ‘బాజీరావ్ మస్తానీ’లో 20 కిలోల బరువున్న దుస్తులు ధరించింది. అనుష్క శర్మ (35 కిలోలు) ‘బాంబే వెల్వెట్’లో, ఐశ్వర్యరాయ్ (30 కిలోలు) ‘జోదా అక్బర్’లో, మాధురీ దీక్షిత్ (30 కిలోలు) ‘దేవదాస్’లో, శ్రీదేవి (25 కిలోలు) ‘రూప్ కీ రాణీ చోరోంకా రాజా’ సినిమాలో ఇలాంటి ‘కాస్ట్యూమ్’ కష్టాలు పడ్డవారే.



## ఇండెక్స్






ఆదివారం
22 జనవరి 2017
ఆంధ్రజ్యోతి


## ఇన్‌బాక్స్

### ఆహ్వానిద్దాం

గత ఏడాది తెలుగు సినిమాలలో వచ్చిన కొన్ని కొత్త కథల గురించి వివరిస్తూ ఇచ్చిన కవర్‌స్టోరీ 'కొత్త కథలు చెప్పారు' బాగుంది. వి.ఐ. ఆనంద్, తరుణ్ భాస్కర్, చందూ మొండేటి వంటి కొత్త దర్శకులు తెలుగు సినిమాలను కొత్త కోణంలో చూపించడం ఆహ్వానించదగ్గ పరిణామం. నాగార్జున లాంటి పెద్ద హీరోలు కూడా మాస్ ఫార్ములాను వదిలిపెట్టి, ప్రయోగాత్మక చిత్రాల వైపు చూడడం మరో మంచి పరిణామం. త్వరలో వినోదంతో పాటు విజ్ఞానాన్ని కూడా అందించే విధంగా తెలుగు సినిమాలు మారతాయని ఆశిద్దాం.

- బి. సుబ్రహ్మణ్యం, మూసాపేట

### రూమ్మేట్ .. కాదు సోల్‌మేట్

వాస్తవికత నిండిన భావుకతకు దర్పణంలా ఉంది 'రూమ్మేట్' కథ. ఇందులోని ప్రతి వాక్యం ఒక భావ గర్భిత బడబానల కావ్యంలా, ప్రతి సామ్యం ఒక సంక్లిష్టమైన మనస్సంఘర్షణా దర్పణంగా తోచాయి. "గడ్డకట్టినట్లున్న నా మీద బండరాళ్ల జలపాతం", "నాకిదిప్పుడు గాయంలా కాక తెరుచుకున్న నేత్రంలా అనిపిస్తోంది", "జ్ఞాననేత్రంతో మంచిని చూసి బోధించిన మహానుభావులు దేవుళ్లయ్యారు, ఆ మంచిని ఆచరణలో ఎలా పెట్టాలో చూపినవాళ్లు సంస్కర్తలూ, యుగకర్తలూ అయ్యారు". ఈ వాక్యాలు రాసిన రచయిత్రి కథనప్రజ్ఞకూ, భావుక ఉపజ్ఞకూ ధన్యవాదాత్మక జ్యోతలు, అభినందనపూర్వక జేజేలు.

- పి.వి. రామశర్మ, విజయవాడ



ఇంగ్లండ్, ఫ్రాన్స్, స్పెయిన్ లాంటి దేశాల నుంచి వలస వెళ్లి అమెరికన్లుగా పిలవబడుతున్న వలసదారులు ఆసియా దేశస్థులపై జాతి దురహంకారం చూపడం ఒక అడుక్కునేవాడు మరో అడుక్కునేవాడిని కసురుకోవడం లాంటిది. గోకుల్ ఛాట్ పేలుళ్ల ఘటనతో మొదలుపెట్టి అమెరికా జాత్యాహంకారం వల్ల ఇబ్బంది పడుతున్న భారతీయ, ఆసియా ఖండ విద్యార్థుల వెతలను వివరించిన విధానం చాలా బాగుంది.

- అంబడిపూడి శ్యామసుందరరావు, గుంటూరు

### ఈ తరానికి చాలా అవసరం

ఈ వారం కథ 'రూమ్మేట్' చాలా బాగుంది. కులం, మతం, జాతి వేర్పాట్లను తిప్పికొట్టే ఇటువంటి కథలను మా తరం(ఈతరం) చదవాల్సిన అవశ్యకత చాలా ఉంది. "ఒక్క శాతం ఉగ్రవాదులకు ప్రతినిధులుగా ముద్ర మోస్తూ తిరుగుతున్న 99 శాతం బాధితులం మేము" అనే వాక్యం నా ఆలోచనలను చాలా ప్రభావితం చేసింది. పై చదువుల కోసం, మంచి సంపాదన కోసం విదేశాలకు వెళ్లి బాధలు పడుతున్న వారి వ్యధలను దీపు పాత్ర ద్వారా చాలా చక్కగా వివరించారు. ఎంతో సున్నితమైన సీరియస్ అంశాన్ని అంతే విశ్లేషణాత్మకంగా, చాలా నేర్పుగా, లోతైన అవగాహనతో మలిచారు రచయిత్రి.

- కె. లక్ష్మీ శరణ్య, అన్నవరం; పి.వి. రమణ, వైజాగ్

### కొత్త విషయాల సమాహారం

'మెర్రీ క్రిస్మస్' కథనం చాలా బాగుంది. క్రిస్మస్ పండుగ గురించి ఇంతకుముందు తెలియని ఎన్నో విషయాలను తెలుసుకున్నాం. క్రిస్మస్ చెట్టు, శాంటాక్లాజ్ తాతల సంగతులు బాగున్నాయి. ప్రతి క్రైస్తవుడి ఇంట్లో కనిపించే వీటితో క్రిస్మస్ పండుగకు సంబంధం లేదని తెలిసి ఆశ్చర్యపోయాం. ప్రతి పండుగకు ముందు ఆ పండుగ విశేషాలను అందిస్తున్న ఆంధ్రజ్యోతికి కృతజ్ఞతలు.

- నీలిమ సబ్బిశెట్టి, రాజానగరం

### ఆ గుర్తులు పదిలం

'వందేళ్ల ఫోటోస్టూడియో' కథనం చాలా బాగుంది. ఎన్ని లక్షలు, కోట్లు పెట్టి పెళ్లి చేసినా రెండో రోజుకు ఆ డెకరేషన్, సెట్టింగ్ అంతా తీసేయాల్సిందే. కాని ఫోటోలు మాత్రమే ఆ ఆనందకరమైన క్షణాలను ప్రేములో భద్రపరిచి, జీవితాంతం గుర్తుంచుకునేలా చేస్తాయి. శతాబ్దం కిందట ప్రారంభమైన ఫోటో స్టూడియోను ఇప్పటికీ నడిపిస్తున్న యజమానులకు అభినందనలు. 'స్లీపింగ్ బ్యూటీ' కథనం ఆశ్చర్యపరిచింది. అందాల అపరంజిలా ఉన్న ఆమె త్వరగా కోలుకోవాలని ఆశిస్తున్నాం.

- వద్ది హర్ష శ్రీకృష్ణ, ఎల్ఎన్‌డీ పేట;
బి. సత్యనారాయణ, విజయనగరం

'ఆదివారం అనుబంధం'పై మీ అభిప్రాయాలను శుక్రవారంలోగా అందేలా పంపగలరు. ఆలస్యంగా అందిన ఉత్తరాలు ప్రచురించడం సాధ్యపడదని మనవి. sunday.aj@gmail.com కి మీ ఉత్తరాల్ని మెయిల్ చేయవచ్చు.

# ముసలోడు గట్టోడే...

అరవై ఏళ్లకే అడుగు ముందుకు పడని వాళ్లు ఎంతోమంది. అలాంటిది 105 ఏళ్ల వయసులో ఒక వృద్ధుడు సాహసోపేతంగా సైకిల్ తొక్కి ఏకంగా ప్రపంచ రికార్డు సృష్టించడం విశేషమే. ఫ్రెంచ్‌మ్యాన్ రాబర్ట్ మర్చండ్‌కు సైక్లింగ్ అంటే పిచ్చి. అయితే రాబర్ట్ పొట్టిగా ఉండటం వల్ల 'నువ్వెప్పుడూ సైక్లింగ్‌లో ఛాంపియన్‌వి కాలేవ'ని ఆయన కోచ్ చెప్పడంతో పోటీ ప్రయత్నాలను విరమించుకున్నాడు. 75 ఏళ్ల తర్వాత ఆయనకు తిరిగి సైక్లింగ్‌పై మక్కువ కలిగింది. 1992లో రాబర్ట్ మాస్కో నుంచి పారిస్‌కు సైకిల్ తొక్కాడు. 62 మైళ్ల పోటీలో గెలిచిన శతాధిక వృద్ధుడిగా 2012లో ప్రపంచ రికార్డు సృష్టించాడు. ఇటీవల 105 ఏళ్లు వచ్చిన సందర్భంగా ఒక గంటలో 14 మైళ్ల దూరం సైక్లింగ్ చేసి మరో ప్రపంచ రికార్డు నెలకొల్పాడు. 'దృఢ సంకల్పం ఉంటే వయసుతో పనిలేదని చాటడానికే ఈ వయసులో ఇలాంటి సాహసం చేశాను' అంటున్న రాబర్ట్ ఆరోగ్య రహస్యం ఏమిటంటే ఆహారంలో కూరగాయలు, పళ్లు అధికంగా తీసుకోవడం... ప్రతి రోజూ క్రమం తప్పకుండా వ్యాయామం చేయడం... రాత్రి 9 గంటలలోపే నిద్రపోవడమట.






అవీ ఇవీ

# బొమ్మల బన్నులు!

మొసలి, బల్లి, కప్ప, గుర్రం... లాంటి 100కు పైగా 'స్టీమ్ బన్'లను తయారుచేయడంలో 55 ఏళ్ల వాంగ్ పూజాంగ్ దిట్ట. 17 ఏళ్ల వయసు నుంచే ఆయన ఈ 'కళ'ను ఒంటపట్టించుకున్నాడు. పండగలు, వేడుకలు జరిగినప్పుడు వివిధ ఆకారాల్లో ఉన్న 'స్టీమ్ బన్'లను స్నేహితులకు, సన్నిహితులకు ఇవ్వడం చైనాలో సుమారు 3 వేల ఏళ్ల నుంచి వస్తున్న సంప్రదాయం. పిండి కలిపిన తర్వాత కత్తెర, దువ్వెన, పెన్ క్యాప్‌ల్లాంటివి ఉపయోగించి రకరకాల ఆకృతులను డిజైన్ చేసి ఆ తర్వాత వాటిని పాత్రలో ఉడికిస్తాడు. పూజాంగ్. 38 ఏళ్లుగా ఆయన ఈ పనినే వృత్తిగా చేసుకున్నాడు. ఒక్కో ఆర్డర్‌కు (ఆరు కిలోల పిండి) సుమారు 12 వందల రూపాయలు వసూలు చేస్తాడు.













## ('మంచి మనిషి' చిత్రంలోని 'ఓహో గులాబి బాలా .. ' పాటకు)

ఓ .. ఓ .. జిలేబి! ఓ .. ఓ .. జిలేబి!!
పెళ్లి విందులో తప్పని దానా!
తీగె వంపుల .. వన్నెల 'సోనా'

ఓహో! జిలేబి బాలా!
జిగటైన తీపి మాల!



ఊరించు రుచుల దానా!
ఊహింతు నిన్ను చానా!
నీవారెవరో తెలుసుకో .. తెలుసుకో! /ఓహో/

కొంటె కోరికతో కొరికేరు
పంటి కింద నిను నమిలేరు
మక్కువతోన ముక్కలు చేసి
గ్రక్కున లోనకు మింగేరు ... మింగేరు! /ఓహో/

చుట్టగా ప్లేటులో చూస్తారు
చుట్టము లాగే వస్తారు
చుట్టును చేరి, తట్టలు పట్టి
లొట్టలు వేస్తూ మేస్తారు ... మేస్తారు! /ఓహో/

**- ఎ. పద్మనాభరావు, 83415 22660**

## ఫటాఫట్



- మగవాళ్లకు సహనం ఎందుకు?
  - పు'రుషులు' కాబట్టి!
- భయస్తుడైన వడ్డీ వ్యాపారి?
  - కస్టమర్లు నూరేళ్లు జీవించాలని అర్చన చేయించేవాడు.
- హైదరాబాద్‌లో ఆడవాళ్లు ఇష్టపడే రోడ్డు?
  - 'నెక్లెస్' రోడ్!

పంపినవారు : **సిహెచ్‌వివిఎస్‌మూర్తి,** పాల్వంచ

## తస్మాత్ జాగ్రత్త!



**క**న్నీరొస్తే తుడవడానికి చాలామంది స్నేహితులుంటారు. కాని జలుబు చేస్తే ముక్కు తుడవడానికి మాత్రం ఎవరూ ఉండరు. మనమే తుడుచుకోవాలి. ముందే చలికాలం - జాగ్రత్తలు పాటించండి!

## తినడం వచ్చు

"ఒరేయ్ మామా .. నాకు 'చాట్' చేయడం రాదురా"
"పోనీ పానీ పూరీ వచ్చా .."

## క్యా డైలాగ్ హై



- "నోటిలో మాట, చేతిలో ఆయుధం .. రెండూ జారకూడదు. మాట జారితే విలువ పోతుంది. ఆయుధం జారితే మనిషే పోతాడు!"

- చిత్రం : **రణం**

పంపినవారు: **అబ్బగాని భాస్కర్,** మహబూబాబాద్



సాహిత్యం మీద మోహం కవిని చేస్తే, సినిమాపై ఇష్టం విమర్శకుణ్ణి చేసింది. ఎంబీయే చదువు ఒక పారిశ్రామికవేత్తగా మార్చింది. ఇలా విభిన్న పాత్రల్లో ఒదిగిపోయారు సిరాశ్రీ. ప్రస్తుతం క్రిటిక్ పాత్రని వదిలి, లిరిసిస్ట్‌గా సినీ, ప్రైవేటు గీతాలతో సాగిపోతున్నారాయన. ఆర్జీవీ డైరెక్షన్‌లో వచ్చిన 'ఎటాక్', 'వంగవీటి' సినిమాల్లో తాను రాసిన పాటల గురించి సిరాశ్రీ మనతో ముచ్చటిస్తున్నారు ఈ వారం 'నా పాట'లో...



# ధర్మరాజు ఓడాడని జూదం చెడ్డదా?

నా పాట...37

నాకు చిన్నప్పటి నుంచి సాహిత్యమంటే ఇష్టం. మా అమ్మమ్మ వల్ల చిన్నప్పుడే శతక పద్యాలు నోటికి వచ్చాయి. వాటికి అర్థాలు హైస్కూలు స్థాయిలో తెలిశాయి. అవధాని నాగఫణిశర్మగారి ప్రభావం నా మీద ఉంది. ఇంటర్‌లో ఉండగానే ఆయన అవధానంలో నేను పృచ్ఛకుడిగా పాల్గొన్నాను. మా పెదనాన్న సి.ఎస్.రావు (ఊరుమ్మడి బతుకులు, ప్రాణంఖరీదు మొదలైన కథల రచయిత) ద్వారా నాకు నాటక, నవల, సినీ సాహిత్యం పరిచయమైంది. సాహిత్యంపై ఉన్న మక్కువతోనే తెలుగు సాహిత్యంలో పీజీ చేశాను. శ్రీశ్రీ, జాషువా, ఆరుద్ర, ముళ్లపూడి, సినారె వంటి ఎందరో ప్రసిద్ధుల రచనలు చదివాను. ఇంగ్లీషులో కుష్వంత్ సింగ్ హాస్య రచనలు, సర్వేపల్లి రాధాకృష్ణగారి 'రిలిజియన్ అండ్ సొసైటీ' వంటి చాలా పుస్తకాలు చదివాను. నా లైబ్రరీలో రెండువేల పుస్తకాలున్నాయి. పుస్తకాలంటే అంత పిచ్చి నాకు.

చదువుకునే రోజుల్లో 'శివ' సినిమా పోస్టరు చూసినప్పుడు మొదలైంది వర్మపై నా అభిమానం. అది నాతో పాటు పెరిగి పెద్దదైంది. వర్మ విభిన్నంగా కనిపించడం పెరిగినకొద్దీ ఆయనపై నా ఆసక్తి మరింత ఎక్కువయింది. ఒక్కసారి కలిస్తే బాగుండు అనుకునేవాడిని... అలాంటిది ఆ తర్వాత కాలంలో ఆర్జీవీకి ఆప్తమిత్రుడ్ని అయ్యాను. ఆయనతో నా ప్రయాణం సుదీర్ఘమైనదనే చెప్పాలి. ఎందుకంటే ఆయన కోసం నేను దాదాపు వంద పాటలు రాశాను. అందులో సినిమాల కోసం వాడుకున్నవి 30-35 ఉంటాయి. చాలాసార్లు ఆయన నాకు ఫోన్ చేసి ఓ సందర్భం వివరించి పాట రాయి అని అడుగుతారు. అది ఏ సినిమాలోదో కూడా చాలాసార్లు చెప్పరు. నేనూ అడగను.

పాట రాయమని వర్మే కాదు ఎవరడిగినా ముందు పల్లవి రాసి నా భార్యకు వినిపిస్తాను. తనకు అర్థమైతే అందరికీ అర్థమైనట్టే అనుకుంటాను. నేటి సినీ ప్రేక్షకుల్ని రిప్రెజెంట్ చేసే టేస్ట్ తనది. అన్నిటికీ మించి డైరెక్టర్ టేస్టుని బట్టే ఏ పాటయినా ఫైనల్ అవుతుంది. 'సత్య-2' సినిమా ఆడియో ఫంక్షన్లో... "ఈ సినిమాలో పాటలు నా సిరాలోంచి కాక, వర్మ శిరస్సులోంచి వచ్చాయి" అని చెప్పడానికి కారణం అదే!

'ధర్మరాజు ఓడాడని జూదం చెడ్డదా' పాట వచ్చిన నేపథ్యం కొంచెం చిత్రమైనది. ఒకరోజు ఏదో మాటల్లో మంచిని, చెడును డిఫైన్ చేయమని అడిగారు వర్మ. "వాటికి డెఫినిషన్స్ ఏముంటాయి? మంచి చెడు అనేవి స్థిరమైనవి కావు నమ్మకాలు మాత్రమే. మీ మంచి నాకు చెడు కావచ్చు. నా చెడు మీకు మంచి కావచ్చు. పాండవులు ఓడారు కాబట్టి వాళ్లకి జూదం చెడు, కౌరవులు గెలిచారు కాబట్టి వాళ్లకి మంచి" అన్నాను.

"నిజమే. మనకు నచ్చినవాడు ఒక పని చేసి పైకొస్తే అది మంచి. అదే నచ్చని వాడు చేస్తే చెడు. మనకి పాండవులు హీరోలు, కౌరవులు విలన్లు కాబట్టి జూదం చెడు అయింది. ఈ టాపిక్ మీద నాకు పాట కావాలి. ఇప్పుడు నువ్వు చెప్పిన, నేను జోడించిన ఈ మ్యాటర్ అంతా పల్లవిలో రావాలి" అన్నారు.

వర్మగారు చెప్పింది బాగానే ఉన్నా పల్లవిలో కుదించడానికి కష్టమేమో అనిపించింది. అయితే ట్యూన్ ఫిక్స్ అవలేదు కాబట్టి స్వేచ్ఛగా రాసేయొచ్చు అనుకుని ఇలా మొదలు పెట్టా-




**ధర్మరాజు ఓడాడని**
**జూదం చెడ్డదా?**
**దుర్యోధనుడే గెలిచాడని కంటగింపు**

కంటగింపు అనే పదం పడగానే, 'కంటికింపు' అనే పదం తట్టింది. వెంటనే...

**పాండవులు గెలిచారని**
**యుద్ధం మంచిదా?**
**కౌరవులు ఓడడం కంటికింపు"**
**అని రాశాను. దానికి కొనసాగింపుగా -**
**మంచి అన్నా చెడ్డ అన్నా**
**నిజాలు కావు నమ్మకాలు**
**మంచివాడు చెడ్డవాడు**

**వేరు వేరు కానే కాదు**
**నమ్మినంత నమ్ముకుంటూ నమ్మిపోరా**

అని పల్లవి ముగించాను. చరణాల గురించి ఆలోచిస్తుంటే రామాయణ, మహాభారతం, భాగవతం కథలు గుర్తొచ్చాయి. తాత్విక, ఆధ్యాత్మిక విశ్లేషణ పక్కనబెట్టి, వర్మగారికి తరచూ వచ్చే సందేహాలను ప్రశ్నలుగా వేస్తే పాట పూర్తయిపోతుందనిపించింది. కవచ కుండలాలు పీకి కర్ణుణ్ణి చంపేస్తే నీతా, దారులన్ని మూసి వేసి అభిమన్యుణ్ణి చంపితే మరి బాధా, సీతను తాకని రావణుడ్ని ఎందుకు రాక్షసుడంటారు, మరి అహల్యను చెరచిన ఇంద్రుణ్ణి ఎందుకు దేవత అంటారు... ఇలాంటి ప్రశ్నలతో మిగిలిన పాట పూర్తి చేశాను.

ఈ పాట వర్మగారికి నచ్చింది. దీనిని మంచు మనోజ్ నటించిన 'ఎటాక్' సినిమాలో వాడారు. సినిమా కన్నా ఈ పాట గురించే ఎక్కువమంది మాట్లాడుకున్నారు. కొంతమంది నన్ను పురాణ, ఇతిహాసాలకు వక్రభాష్యం చెప్పానని విమర్శించారు కూడా. నేను ఏ భాష్యం చెప్పలేదు. ప్రశ్నించానంతే.. అది కూడా వర్మగారి ఆలోచనని అనుసరించి.




ఆయన సినిమాలకు నేను రాసిన పాటల్లో నాకు బాగా నచ్చిన మరో పాట 'మరణం అది తథ్యం'. ఈ పాటని వర్మగారే పాడారు. ఈ పాట గురించి మాట్లాడుతూ ఆయన "భయపడే వాడెవ్వడూ చరిత్ర సృష్టించలేడు. ముఖ్యంగా చావు భయం ఉన్నవాడు అసలు సృష్టించలేడు... ఈ లైన్స్‌లో పాట కావాలి" అంటూ మొదటిలైను 'మరణం అది తథ్యం' అని స్వీయబాణీలో హమ్ చేశారు. వర్మగారిచ్చిన మొదటిలైను ఆధారంగా ఆలోచిస్తుంటే 'ప్రతివాడికెదురయ్యే సత్యం' అని రెండో లైను తట్టింది. అంతవరకూ బాగానే ఉంది కానీ ముందుకెళ్లడానికి మ్యాటర్ తట్టలేదు. రోజంతా ఆలోచించాను. చరిత్ర నేపథ్యంలో సాగే పాటకి గాంభీర్యం కావాలి. ఎక్కువమంది నుంచి ఆమోదం ఉండాలి. ఇంతకీ వర్మగారు ఇచ్చిన మొదటి లైను 'మరణం అది తథ్యం'... అనేది సాక్షాత్తు భగవద్గీతలోని "జాతస్య హి ధృవో మృత్యుః" అనే వాక్యానికి తెలుగు రూపం. ఇక భగవద్గీతనే ఆశ్రయిస్తే పని అవుతుందని ఇలా మొదలుపెట్టాను.



**జాతస్య ధృవో మృత్యుః**
**ధృవం జన్మ మృతస్యచ**
**తస్మాద పరిహార్యేర్థే**
**నత్వం సోచి తుమర్హసి**

అని భగవద్గీతలోని వాక్యాలే రాసి వాటికి అర్థం చెపుతున్నట్టుగా

**మరణం అది తథ్యం... ప్రతివాడికెదురయ్యే సత్యం**
**జననం అది నిత్యం... జీవితానికి ఉంది అర్థం**

అంటూ పాట కొనసాగించాను. ఇలా ఈ పాట శ్లోకానికి అర్థం చెబుతున్న ఫార్మాట్‌లో సాగినా, నిజానికి ఇది కేవలం గీతని ఆలంబనగా తీసుకుని 'వంగవీటి' కథాంశానికి తగ్గట్టుగా చేసిన రచన.

ఈ పాట మీద విమర్శలు రాకపోవడానికి కారణం ఇందులో ధ్వనించిన గీతాశ్లోకాలే అని నా ఫీలింగ్. వాటి వల్ల పాటకి ఓ పవిత్రత చేకూరింది. ఈ పాటని రాంగోపాల్ వర్మగారి గొంతులో వినడం మరో అనుభూతి. దేవుడ్ని ప్రశ్నించే వ్యక్తి సినిమాలో 'భగవద్గీత' శ్లోకాలకు ఎలా చోటు దొరికిందంటే దాని పట్ల వర్మగారికి ఉన్న గౌరవమే. మాటల్లో చెప్పకపోయినా రామాయణ, భారతం, భగవద్గీతల మీద ఆయనకు చాలా గౌరవం ఉందని నాకు తెలుసు. అందుకే సనాతన భారతీయ చింతనని తన సినిమా పాటల్లో ప్రతిధ్వనించడాన్ని ఆయన ఆమోదించగలరు. ఇక్కడ ఉదహరించిన రెండు పాటలూ ఆ కోవకు చెందినవే! ■

## ఎన్ని డిగ్రీలో...!

ఇవ్వాళ రేపు విద్యావంతులందరికీ రెండు మూడు డిగ్రీలు ఉండడం కామన్ అయిపోయింది. బి.టెక్ చేస్తే ఎం.ఎస్ తప్పనిసరి. ఎం.బి.బి.ఎస్ చేస్తే పి.జి. తప్పనిసరి. అయితే ఒకటీ రెండూ కాదు ఏకంగా 145 డిగ్రీలు సంపాదించాడు ఒకానొక వ్యక్తి. అతను చెన్నైకి చెందిన వి.ఎన్. పార్థిబన్. మూడున్నర



దశాబ్దాలుగా డిగ్రీల మీద డిగ్రీలు చదివేస్తున్న పార్థిబన్ వయసు ప్రస్తుతం 55 ఏళ్లు. ఫిలాసఫీలో 12, బిజినెస్ అడ్మినిస్ట్రేషన్‌లో 9, న్యాయశాస్త్రంలో 8, ఆర్ట్స్‌లో పది, వాణిజ్యశాస్త్రంలో 8, రసాయన శాస్త్రంలో మూడు డిగ్రీలు ఇప్పటికే ఇతని ఖాతాలో వచ్చి చేరాయి. వాణిజ్యశాస్త్రంలో పిహెచ్.డి కూడా చేశారు. "చిన్నప్పుడు నాకు చదువు సరిగా అబ్బట్లేదని మా అమ్మ బెంగపడేది. డిగ్రీ మొదటి సంవత్సరం పరీక్షల్లో 59.9 శాతం మార్కులతో పాస్ అయ్యాను. అమ్మ ఆ రోజు చాలా బాధపడింది. అప్పుడే ఆమెతో చెప్పాను. నేను బ్రతికి ఉన్నంతకాలం చదువుతూనే ఉంటానని. ఆమెకిచ్చిన మాటే ఇన్ని డిగ్రీలు పూర్తిచేసేంత పట్టుదలను నాకు ఇచ్చింది" అని చెప్పాడు పార్థిబన్. ప్రస్తుతం చెన్నైలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న ఆయన వివిధ కళాశాలల్లో దాదాపు 100 సబ్జెక్టులను బోధిస్తున్నాడు. "నేను ఇన్ని పట్టాలు సాధించడం వెనక నా శ్రీమతి సహకారం కూడా చాలా ఉంది. పిల్లల సంరక్షణను, ఇంటి నిర్వహణా బాధ్యతను ఆమే పూర్తిగా తీసుకోవడం వల్లే నేను వేరే ఏ ఆలోచనా లేకుండా చదువుకోగలుగుతున్నాను" అని చెప్పాడు పార్థిబన్. బ్యాంకు ఉద్యోగి అయిన పార్థిబన్ భార్య కూడా తొమ్మిది డిగ్రీలు పూర్తిచేయడం మరో విశేషం.




# 'సెంట్' పర్సెంట్

## lifestyle

**పెర్‌ఫ్యూమ్, అత్తరు, సెంట్, సుగంధ ద్రవ్యం... పేరేదైనా దాని పరిమళం తరతరాలుగా గుబాళిస్తూనే ఉంది. అవి లేకుండా నవతరం అడుగు ముందుకు పడటం లేదు. కేవలం పార్టీలకు, ఫంక్షన్లకే కాదు... ప్రతీరోజూ నచ్చిన పెర్‌ఫ్యూమ్ స్ప్రే చేసుకోవడం లైఫ్‌స్టయిల్‌లో భాగమైంది. ముఖ్యంగా యువతీయువకుల వార్డ్‌రోబ్‌లలో సువాసనలు వెదజల్లే సెంట్ బాటిళ్లు, డియోడరెంట్లు తప్పకుండా ఉంటున్నాయి. మునుపంటే గులాబీ పరిమళమో, మల్లెపూల సెంటో కొట్టుకుని సంతృప్తిపడేవారు కానీ ఇవ్వాళ అలా కాదు. నేడు మార్కెట్లో దేశ, విదేశీ సువాసనలు లెక్కలేనన్ని లభ్యమవుతున్నాయి. సెలబ్రిటీలు, సామాన్యులు అనే తేడా లేకుండా అందర్నీ మత్తెక్కిస్తున్న ఆ పరిమళాల గురించే ఈ వారం కవర్‌స్టోరీ.**



కనౌజ్‌లో అత్తర్ల తయారీ

ఢిల్లీలోని ఖాన్ మార్కెట్, సర్దార్ బజార్... ముంబాయిలోని బెండీ బజార్... హైదరాబాద్‌లోని లాడ్‌బజార్-మోతీచౌక్... నిత్యం పెర్‌ఫ్యూమ్ గుబాళింపులతో, సుగంధ ప్రేమికులతో కళకళలాడుతూ కనిపిస్తాయి. ఇక్కడ ఆకర్షించే అనేక వర్ణాల్లో సెంటు సీసాలు మెరుస్తూ కనిపిస్తాయి. ఒకటి కాదు రెండు కాదు కొన్ని వందల వెరైటీలు... దేశీ అత్తర్లు కానివ్వండి, విదేశీ సెంట్లు కానివ్వండి ఎవరికివారు తమ అభిరుచికి తగ్గట్టుగా కొనుగోలు చేస్తూ కనిపిస్తారు. మెట్రోనగరాల్లోనే కాదు దేశవ్యాప్తంగా అనేక పట్టణాల్లో సైతం పెర్‌ఫ్యూమ్స్, డియోడరెంట్స్ కొంటున్నవారి సంఖ్య రోజురోజుకు బాగా పెరుగుతోందని సర్వేలు చెబుతున్నాయి. బడా సూపర్‌మార్కెట్లలోనే కాదు చిన్న చిన్న కిరాణాషాపుల్లో సైతం ఇవి లభ్యమవుతున్నాయి. మన దేశంలో పెర్‌ఫ్యూమ్ మార్కెట్ 10 వేల కోట్ల రూపాయలకు పైగా ఉంటుందని మార్కెట్‌వర్గాలు అంచనా వేశాయి.

కవర్ స్టోరీ

### అత్తర్ల రాజధాని...

దేశీ అత్తర్లకు ఉత్తరప్రదేశ్‌లోని చిన్న పట్టణం కనౌజ్ పేరుగాంచింది. గంగా, కాళీ నదుల సంగమ ప్రదేశంలో ఉండే ఈ పట్టణాన్ని రాజధానిగా చేసుకుని క్రీ.శ 600 కాలంలో హర్షవర్ధనుడనే చక్రవర్తి పాలించాడు. ఆయనకు సుగంధ ద్రవ్యాలంటే చాలా ఇష్టమట. అందుకే ఈ ప్రాంతంలోని అత్తరు తయారీదారులకు ప్రోత్సాహకాలు ప్రకటించి మరీ పరిమళభరిత అత్తర్లను తయారుచేయించేవాడట. తన రాజ్యానికి విచ్చేసిన విదేశీయులకు, ఇతర రాజ్యాల ప్రముఖులకు వాటిని బహుమతులుగా ఇచ్చేవారట. దాంతో కనౌజ్ అత్తర్ల కేంద్రంగా ప్రసిద్ధి చెందింది. ఇప్పటికీ మన దేశంలో వివిధ సుగంధ ద్రవ్యాలకు సంబంధించిన ముడిసరుకు ఇక్కడి నుంచే సరఫరా అవుతుంది. 'డెగ్ (డేగిశా) అని పిలిచే రాగి పాత్రల్లో పూలు, చెట్టు బెరళ్లు, చెక్కల నుంచి తీసిన చందనం, నూనెలను సుమారు పదిగంటల పాటు ఉడికించి ఆ ఆవిరిని ప్రత్యేక గొట్టం ద్వారా సీసాలలో నింపుతారు. ఆ తర్వాత ఒక ప్రత్యేక విధానంలో నీటిని వేరు చేసి సాంప్రదాయ అత్తర్లను తయారుచేస్తారు. అయితే రసాయనాల వాడకం పెరగడంతో ఒకప్పుడు 600కు పైగా



పెర్‌ఫ్యూమ్ తయారీ కేంద్రాలున్న కనౌజ్‌లో ప్రస్తుతం 200 వరకు మాత్రమే ఉన్నాయి. విదేశాల నుంచి సుగంధ నూనెలను, రసాయనాలను తెప్పించుకుని మన దగ్గర మిక్స్ చేయడం ఎక్కువయ్యిందని అంటున్నారు.

## రెండింటికీ ఇదీ తేడా...

పెర్‌ఫ్యూమ్స్, డియోడరెంట్లు మధ్యనున్న తేడా కొంతమందికి తెలియదు. రెండూ కూడా ఒంటికి స్ప్రే చేసుకునేవేగా అనుకుంటారు. డియోడరెంట్లు శరీరం నుంచి వెలువడే దుర్గంధాన్ని అరికట్టేందుకు వినియోగిస్తారు. వీటిలో సుగంధపు నూనెలు 10 నుంచి 15 శాతం ఉంటే, పెర్‌ఫ్యూమ్స్‌లో 15 నుంచి 25 శాతం ఉంటాయి. రెండింటిలో కూడా ఆల్కహాల్ మిక్స్ చేస్తారు. డియోడరెంట్లను శరీరంపై నేరుగా స్ప్రే చేసుకుంటే (ముఖ్యంగా బాహుమూలాల్లో) పెర్‌ఫ్యూమ్స్‌ను దుస్తులపై స్ప్రే చేసుకుంటారు. చెమట వల్ల డియోడరెంట్లు కొంతసేపటి తర్వాత పనిచేయవు. పెర్‌ఫ్యూమ్స్ మాత్రం రోజంతా శరీరాన్ని పరిమళభరితంగా ఉంచుతాయి. పెర్‌ఫ్యూమ్స్, అత్తర్లు (దేశీయంగా తయారయ్యేవి) మెసొపొటోమియా, ఈజిప్టు నాగరికతల కాలం నుంచి ( ఆ తర్వాత రోమన్లు, పర్షియన్లు రిఫైన్ చేశారు) ఉన్నాయని చరిత్ర చెబుతుంటే... డియోడరెంట్లు మాత్రం 1940 తర్వాతే వెలుగుచూశాయి. తొలుత 'రోల్ ఆన్' (వాక్స్‌టైపులో ఉండి బాహుమూలాల్లో అప్లయ్ చేసేవి) డియోడరెంట్లు ఆవిర్భవించి ఆ తర్వాత డియోడరెంట్ స్ప్రేలు మార్కెట్లోకి వచ్చాయి. ప్రస్తుతం ఇవి ప్రతీ ఒక్కరి లైఫ్‌స్టయిల్‌లో భాగమయ్యాయి.

## ఎన్నో వెరైటీలు... ఎన్నెన్నో బ్రాండ్లు...

ఒకప్పుడు గులాబీ, మల్లెపూల గుబాళింపుతో మాత్రమే సువాసనలు వెదజల్లిన సెంట్లు కాలక్రమేణా అనేక వర్గాల్లో, అనేక వాసనలతో ఆకట్టుకుంటున్నాయి. మోడ్రన్ పెర్‌ఫ్యూమ్స్ ప్రధానంగా ఫ్లోరల్ (పువ్వుల నుంచి తయారుచేసేవి), గ్రీన్ (గడ్డి, కీరదోసల నుంచి తయారుచేసేవి), అక్వాటిక్ (సముద్రపు ఒడ్డున ఉన్న ఫీలింగ్ కోసం), సిట్రస్ (తాజా పరిమళం కోసం), ఫ్రూటీ (రకరకాల పళ్ల సువాసనలతో), గార్మండ్ (వెనిలా, చాక్లెట్ వంటి ఐస్‌క్రీమ్ సువాసనలతో) కేటగిరిల్లో లభిస్తాయి. ఆయా కేటగిరిల్లో ఒక్కో బ్రాండ్ చాలా వెరైటీలను అందుబాటులో ఉంచుతున్నాయి. ఉదాహరణకు అర్మానీ బ్రాండ్‌ను తీసుకుంటే అది 'అల్బెర్టో మోరిల్లాస్', 'ఆలీవర్ క్రెస్ప్' మొదలైన 86 రకాల పెర్‌ఫ్యూమ్స్‌ను మార్కెట్లోకి విడుదల చేసింది. కాల్విన్ క్లీన్ బ్రాండ్ 'షీర్ బ్యూటీ', 'యుఫోరియా మెన్' వంటి అనేక రకాలతో, డియోర్ బ్రాండ్ 'ఎవా సావేజ్', 'జె అడోర్' వంటి పేర్లతో, రాల్ఫ్ లారెన్ బ్రాండ్ 'పోలో', 'రొమాన్స్', 'సఫారీ', 'ఎక్స్‌ప్లోరల్' వంటి పేర్లతో పెర్‌ఫ్యూమ్ ప్రియుల మనసు దోచుకుంటున్నాయి.

డియోడరెంట్లు ప్రధానంగా నార్మల్, యాంటీపెర్స్పిరెంట్ (చెమటకు వ్యతిరేకంగా), క్లినికల్ స్ట్రెంత్ (విపరీతంగా చెమట కారే వారి కోసం), హైపో అలెర్జెనిక్ (సెన్సిటివ్ స్కిన్ ఉన్న వారి కోసం) శ్రేణుల్లో లభిస్తాయి. మన దేశంలో సుమారు 500 బ్రాండ్లు వెయ్యికి పైగా వెరైటీలను అందిస్తున్నాయి. వాటిలో ఆక్స్, ఎంగేజ్, ఫాగ్, పార్క్ ఎవెన్యూ, ఓల్డ్‌స్పైస్, నైకీ వంటివి మార్కెట్‌లో బాగా అమ్ముడవుతున్నాయి. ఇక స్థానిక అత్తర్ల విషయానికొస్తే జన్నత్ అల్ ఫిరదౌస్, నవాబ్ సాహెబ్ అత్తర్ వంటి పేర్లతో లెక్కలేనన్ని వెరైటీలు కనిపిస్తాయి. "గతంలో డిస్టిలరీల నుంచి చందనపు నూనె, పువ్వులతో సహజసిద్ధంగా తయారుచేసిన అత్తర్లు వచ్చేవి. ఇప్పుడు మాత్రం రకరకాల సుగంధభరిత నూనెలను తెప్పించుకుని వాటిని మిక్స్ చేసి అమ్ముతున్నాం. సీజన్ బట్టి కూడా అత్తర్లుంటాయి. వేసవిలో ఎక్కువగా రోజ్, జాస్మిన్, శాండల్‌వుడ్ అమ్మకాలు జరిగితే, చలికాలం అంబర్, మస్క్, కేసరి వెరైటీలు బాగా అమ్ముడవుతాయి. వర్షకాలంలో మిస్ట్ వెరైటీని కొంటుంటారు. అయితే మిగతా కాలాలతో పోలిస్తే వర్షాకాలంలో అమ్మకాలు తక్కువగానే ఉంటాయి " అని చార్మినార్ దగ్గర అత్తర్లు అమ్మే యాసుఫ్ అన్నారు. అగర్‌వుడ్ అనే బెరడు నుంచి తయారుచేసే 'ఊద్' అత్తర్లు ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన అత్తర్లలో ఒకటని వారు చెబుతున్నారు. పది ఎం.ఎల్ బాటిల్ ధర 20 వేల రూపాయల వరకు ఉంటుందంటున్నారు. షమ్మా, ఖుష్, మోగ్రా, జెండా, జాఫ్రాన్ వంటి అత్తర్లకు మార్కెట్లో బాగా డిమాండ్ ఉంటుందట. విచిత్రమేమిటంటే పెర్‌ఫ్యూమ్ రంగంలో టాప్ అని చెప్పుకునే హ్యూగో, బాస్, చార్లీ, కాల్విన్ క్లీన్, ఎల్ పసో వంటి విదేశీ బ్రాండ్ల పేర్లతో కూడా స్థానికంగా నకిలీ అత్తర్లు ఉండటం. ఈ నకిలీలు మార్కెట్లో వంద నుంచి రెండు వందల రూపాయలకే లభిస్తాయి.



'స్టార్' బ్రాండ్స్... శిల్పాశెట్టి, జీనత్ అమన్



## 'స్టార్' పెర్‌ఫ్యూమ్స్ ...

సౌందర్య సాధనాలు, గృహోపకరణాలు, లగ్జరీ కార్లు వంటి ఉత్పత్తుల అమ్మకాలకు 'స్టార్ల' గ్లామర్‌ను ఉపయోగించుకున్నట్టే అనేక పెర్‌ఫ్యూమ్ బ్రాండ్లు తమ ఉత్పత్తుల ప్రచారానికీ వాళ్లనే ఆశ్రయిస్తున్నాయి. స్టార్స్ పేరుతో పెర్‌ఫ్యూమ్స్ వెరైటీలను మార్కెట్‌లోకి విడుదల చేయడం అనేది హాలీవుడ్‌లో ఎప్పటి నుంచో ఉంది. మన దేశంలో తొలిసారిగా 1990లో అప్పటి సెక్సీ హీరోయిన్ జీనత్ అమన్ పేరిట పెర్‌ఫ్యూమ్ విడుదల చేశారు. ఒక ఫ్రెంచ్ కంపెనీ సెంటు బాటిల్ మీద జీనత్ అమన్ బొమ్మ



వేసి 'జీనత్' అనే పేరుతోనే పెర్‌ఫ్యూమ్‌ను విడుదల చేయడం అప్పట్లో సంచలనం సృష్టించింది. 2007లో మార్క్ ఎర్న్‌షా అనే సంస్థ శిల్పాశెట్టి సిగ్నేచర్‌తో 'ఎస్ 2' అనే బ్రాండ్‌ను మార్కెట్లోకి తీసుకొచ్చింది. క్రికెటర్ ధోనీ, బిగ్ బీ అమితాబ్ పేరిట కూడా పెర్‌ఫ్యూమ్స్ వచ్చి హిట్టయ్యాయి.

## రూ. 6 కోట్ల సెంట్ బాటిల్!



యాపిల్ షేప్‌లో ఉన్న బాటిల్‌లో బంగారు వర్ణంలో మెరిసిపోతున్న ఈ పెర్‌ఫ్యూమ్ ఖరీదు ఎంతో తెలుసా? అక్షరాలా 6 కోట్ల రూపాయలు. ప్రపంచంలో అత్యంత ఖరీదైన పెర్‌ఫ్యూమ్ ఇదే. ఫ్యాషన్ ప్రపంచంలో టాప్ బ్రాండ్‌గా పేర్కొనే 'డికెఎన్‌వై' (డొన్నా కరన్ న్యూయార్క్) 2011లో విడుదల చేసిన 'డికెఎన్‌వై గోల్డెన్ డెలిషియస్' అనే ఈ స్పెషల్ ఎడిషన్ పెర్‌ఫ్యూమ్ బాటిల్‌ను 183 నీలాలు, 2700 వజ్రాలు, బంగారంతో తయారుచేశారు.

### ఆకట్టుకునే బాటిల్స్...

నిజం చెప్పాలంటే పెర్‌ఫ్యూమ్ కన్నా అందర్నీ ముందుగా ఆకర్షించేది దాని బాటిల్. 10 ఎం.ఎల్, 20 ఎం.ఎల్ సైజుల్లో ఉండే ఆ వెరైటీ వెరైటీ బాటిళ్లను చూడగానే కొనాలనిపిస్తుంది ఎవరికైనా. పువ్వులాగా, వజ్రంలాగా, హృదయాకారంలో భలే ముద్దొస్తుంటాయి. పెర్‌ఫ్యూమ్ అయిపోయినా ఆ గాజు బాటిళ్లను అలాగే ఇంట్లో పెట్టుకునేవారు ఎంతోమంది ఉన్నారు. "పెర్‌ఫ్యూమ్స్‌ను గిఫ్టులుగా ఇచ్చేవాళ్లే ఎక్కువగా ఉంటారు. పైగా పెర్‌ఫ్యూమ్‌ను లగ్జరీగా చూస్తారు కాబట్టి దాని డిస్‌ప్లే కూడా అంతే లగ్జరీగా ఉండాలనేది వ్యాపార రహస్యం. అందుకే ఆ బాటిళ్లను ప్రత్యేకంగా తయారుచేయిస్తారు. నిజం చెప్పాలంటే పెర్‌ఫ్యూమ్ రిచ్‌నెస్ అంతా వాటి సీసాల్లోనే ఉంటుంది. ఇక సెంటును గాజుసీసాల్లోనే ఎందుకు ఉంచుతారంటే దానిలోని పరిమళ ద్రవ్యాలు, ఆల్కహాలు ఆవిరైతే సువాసన పోతుంది. అందుకే పూర్వకాలం నుంచి ఇప్పటిదాకా కూడా పెర్‌ఫ్యూమ్ బాటిళ్లకు ఒక ప్రత్యేకత ఉంది" అని పెర్ఫ్యూమర్ వర్షిత అన్నారు.

### ఏది అసలు... ఏది నకిలీ?




పెర్‌ఫ్యూమ్ మార్కెట్లో నకిలీలను గుర్తించడం ఒక రకంగా కష్టంతో కూడుకున్న పని. అలాగే పెర్‌ఫ్యూమ్ నాణ్యతను, అది నిజంగా అంత ఖరీదు చేస్తుందా అనేది తెలుసుకోవడం సామాన్యులకు కష్టమైన పనే. విదేశీ బ్రాండ్లయినా, స్వదేశీ బ్రాండ్లయినా వాటి పేరు మీదే అమ్ముడవుతాయి. "ఆల్కహాల్ బాటిళ్లూ, సెంటు బాటిళ్లూ ఒకటే టైపు. బ్రాండ్‌ను బట్టి వాటి ధర ఉంటుంది. ఫలానా విస్కీ పదేళ్లది, ఇరవై ఏళ్లది అంటే నమ్మినట్టే... ఫలానా పెర్‌ఫ్యూమ్ గొప్పదనం ఇదీ అని చెప్పి రేటు చెబితే నచ్చి నమ్మి తీసుకుంటారు" అని హైదరాబాద్‌లోని సిండరెల్లా పెర్‌ఫ్యూమ్స్‌కు చెందిన ఒక పెర్‌ఫ్యూమర్ అన్నారు. అయితే ఒక కిటుకు మాత్రం చెపుతారు వాళ్లు. మణికట్టు మీద 'టెస్టర్'తో స్ప్రే చేసిన వెంటనే దాన్ని కొనేయాలన్న నిర్ణయానికి రావడం సరైనది కాదట. స్ప్రే చేసిన గంట తర్వాత, లేదా నాలుగైదు గంటల తర్వాత కూడా దాని పరిమళం అలాగే ఉంటే అప్పుడు దాని నాణ్యత బయటపడుతుందట. " మన దేశంలో అత్తర్ల తయారీకి ఎంతో చరిత్ర ఉన్నప్పటికీ ఇప్పటికీ మన దగ్గర ఒక్కటంటే ఒక్క పెర్‌ఫ్యూమరీ స్కూల్ రాలేదు. గతంలో ఎస్.హెచ్. కేల్కర్ అనే ఆయన ఒక స్కూల్ పెట్టినప్పటికీ ఆ తర్వాత ఆయన కాస్మొటిక్స్ వ్యాపారంలోకి వెళ్లాడు. పెర్‌ఫ్యూమర్‌గా కావాలంటే ఫ్రాన్స్‌కు వెళ్లయినా శిక్షణ తీసుకోవాలి, లేదంటే సొంతంగా పుస్తకాల్లోనైనా, ఇంటర్నెట్‌లోనైనా చదువుకోవాలి" అని నివేదిత అస్సర్ అన్నారు. వారసత్వంగా వచ్చిన సుగంధద్రవ్యాల కంపెనీని నడుపుతున్న నివేదిత 'ఫ్రాగ్రెన్సెస్ అండ్ ఫ్లేవర్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా' (ఫాఫాయ్)కు తొలి మహిళా అధ్యక్షురాలిగా పనిచేశారు. 2002లో ఆమె ఫ్రాన్స్‌లోని 'గ్రాస్సే ఇనిస్టిట్యూట్ ఆఫ్ పెర్‌ఫ్యూమరీ'లో శిక్షణ తీసుకున్నారు.

### మారుతున్న ట్రెండ్...

చాలాకాలం పాటు విదేశీ బ్రాండ్ల పట్ల మక్కువ కలిగిన యువతరం ఇప్పుడిప్పుడే నెమ్మది నెమ్మదిగా లోకల్ అత్తర్ల వైపు దృష్టి సారిస్తోందని మార్కెట్ వర్గాలు చెప్పాయి. " గతంలో నేను గుస్సీ, డేవిడాఫ్ బ్రాండ్లు మాత్రమే ఉపయోగించేవాణ్ణి. అయితే ప్రతీ ఒక్కరూ వాటినే వాడటంతో నా ప్రత్యేకత లేకుండా పోయింది. ఒకసారి చార్మినార్‌కు వెళ్లి లోకల్ అత్తర్లను ట్రై చేశా. బాగుందనిపించింది. అప్పటి నుంచి వాటికే అలవాటు పడ్డా. ధరలో వ్యత్యాసం కూడా ఒక కారణం కావచ్చు. విదేశీ పెర్‌ఫ్యూమ్స్ ధర వేలల్లో ఉంటే లోకల్ అత్తర్ల ధర వందల్లో ఉంటుంది" అని ఒక లగ్జరీ కార్ల కంపెనీలో మార్కెటింగ్ హెడ్‌గా పనిచేస్తున్న కిషోర్ అన్నారు. లోకల్ అత్తర్లకు విదేశాల్లో కూడా క్రేజ్ ఏర్పడుతోంది. రష్యా, దక్షిణాఫ్రికా, మధ్య ప్రాచ్య దేశాలకు కూడా అవి ఎగుమతి అవుతున్నాయి. నిజానికి మన దేశంలో పెర్‌ఫ్యూమ్‌లకు, డియోడరెంట్లకు మెట్రో నగరాల కన్నా సెకండ్, థర్డ్ గ్రేడ్ సిటీలలోనే డిమాండ్ ఎక్కువగా ఉంది. అందుకే ఆయా కంపెనీలు చిన్న నగరాలు, పట్టణాలపైనే ఎక్కువ దృష్టి సారిస్తున్నాయి. పెర్‌ఫ్యూమ్స్ విషయంలో మహిళల కన్నా పురుషులకే 'ఛాయిస్' ఎక్కువగా ఉంది. ప్రతీనెలా డియోడరెంట్స్, పెర్‌ఫ్యూమ్స్, రోల్ ఆన్‌ల కోసం యువతీయువకులు ఒక్కొక్కరు 500 రూపాయల నుంచి 2 వేల రూపాయల దాకా ఖర్చు చేస్తున్నారని 'అసోచామ్' లెక్క తేల్చింది. సహజంగానే మార్చి- సెప్టెంబర్ మధ్యలో అంటే వేసవిలో ఇవి ఎక్కువ అమ్ముడవుతున్నట్లు తేలింది. తీర ప్రాంత నగరాల్లో కూడా వీటి అమ్మకాల జోరు ఎక్కువగా ఉంది. ఇదంతా చూస్తుంటే రానున్న కాలంలో ఈ గుబాళింపు రెట్టింపయ్యేలా కనిపిస్తోంది.

- సండే డెస్క్



# నా ఇష్టం





అవి పాత నోట్లు... తియ్యకు, పట్టుకొని లోపలేస్తారు !!




పండుగ వెళ్ళి వారం, అమ్మాయి వెళ్ళి నాలుగు రోజులైంది. మీకు టిక్కెట్ బుక్ చెయ్యమంటారా అల్లుడుగారూ?




పండుగ ముందు
పండుగ తరువాత




ఊరెళ్ళి రెండు రోజుల్లో వచ్చేస్తా ఆశ్రమాన్ని జాగ్రత్తగా చూసుకో !!
యోగాశ్రమం




ప్రతిముంది ఆయన్ని ఒక్కగంట ఇంటికి పంపించండి సార్. మళ్ళీ పంపించేస్తా !!




# కోస్టా రికా..

# అడవి అందాల మధ్య అడ్వెంచర్లు

**'కోస్టా రికా' సెంట్రల్ అమెరికాలో ఉండే ఒక చిన్న దేశం. పైన నికరాగువా, కింద పనామా, తూర్పున కరీబియన్ సముద్రం, పడమట పసిఫిక్ మహాసముద్రం... వీటి మధ్యన ఉండే దేశం సహజంగానే ప్రకృతి రీత్యా రిచ్ ('రికా'), కోస్టల్ ('కోస్టా') దేశం అవుతుంది కదా! అందుకే దానికా పేరు. అంతకుముందు వెళ్ళొచ్చిన మా మిత్రుల కబుర్లు విని రెండు జంటల వాళ్ళం పిల్లాపాపలతో కలిసి క్రిస్మస్ సెలవులు గడపడానికి సిలికాన్ వాలీ శాన్ హోసే నుంచి కోస్టా రికా రాజధాని శాన్ హోసేకి బయలుదేరి వెళ్ళాం.**

కోస్టా రికాలో ముఖ్యంగా చూడవలసినవి అక్కడి అందమైన రెయిన్ ఫారెస్ట్‌లు, బీచ్‌లు, నిద్రాణమై ఉన్న ఒక అగ్నిపర్వతం, వాటిలో ఉన్న సహజమైన వేడి నీటిబుగ్గలు. ఒక్కో చోటా రెండు రోజుల పాటు, మొత్తం మూడు ప్రదేశాలూ చుట్టి వచ్చేలా ఒక ప్రయాణ ప్రణాళిక తయారు చేసుకున్నాం. సీజన్ కాబట్టి హోటల్ రేట్లు ఎక్కువగా ఉన్నాయి కాని మామూలు రోజుల్లో అయితే ఖర్చు అందులో సగమే అయ్యేది. ఉదయం ఆరింటికి శాన్ హోసేలో దిగి నేరుగా మా మొదటి మజిలీ మాంటే వర్డె (పచ్చని పర్వతం)కి బయల్దేరి వెళ్ళాం. ఆ రోజంతా వర్షం పడుతుండడంతో ఎక్కడికీ వెళ్ళకుండా హోటల్లోనే ఉండిపోయాం.

### జిప్‌లైన్లకి వేలాడుతూ...

మర్నాడు సెల్వట్యూరా అడ్వెంచర్ పార్కుకు వెళ్ళాం. ఈ పార్కులోని ప్రధాన ఆకర్షణ 'జిప్ లైనింగ్'. రెండు చెట్లకి మధ్య ఇనుప తాళ్లు కట్టి ఉంటాయి. ఒక కప్పీకి వేలాడుతూ మనం ఒక చోటి నుంచి ఇంకొక చోటికి వెళ్ళాలి. అదనపు రక్షణ కోసం మన శరీరాలకి 'బాడీ హార్నెస్' కడతారు కనక ప్రమాదం ఏమీ ఉండదు. ఇలా పదమూడు జిప్ లైన్లలో వెళ్తే ఆ టూర్ పూర్తవుతుంది. ఈ జిప్‌లైన్లు 200 మీటర్ల నుంచి ఒక కిలోమీటర్ వరకు వివిధ పొడవుల్లో ఉంటాయి. ఎత్తయిన చెట్లలో చిక్కుబడిన మేఘాలను చీల్చుకుంటూ, కొంచెం భయం, మరెంతో ఆశ్చర్యం కలిగించే దట్టమైన పచ్చని ప్రకృతిని చూస్తూ చేసే ఈ జిప్ లైనింగ్ టూర్ కోస్టా రికాలో ఎవరికైనా జీవితాంతం గుర్తుండిపోయే అనుభవం. దీనిలో చివరి జిప్‌లైన్ ఒక కిలోమీటర్ పొడవు ఉంటుంది. మన బరువు కనక తక్కువైతే మధ్యలోనే ఆగిపోయే ప్రమాదం ఉంది. మా పిల్లలిద్దరూ సగంలో ఇరుక్కుపోవడం కూడా ఆ అనుభవంలో ఒక భాగమే! చివరికి ఒక గైడ్ వెళ్లి వాళ్ళని తన భుజ బలంతో లాక్కువచ్చాడు. ఆ సమయంలో అతను ఏ హాలీవుడ్ హీరోకీ తక్కువ కాడు అనిపించింది. అదే అడవిలో ఉన్న 'హాంగింగ్ బ్రిడ్జెస్" (వేలాడే వంతెనలు) మీద మూడు మైళ్ళ వన సంచారం చేశాం. అప్పటికి చీకటి పడిపోవటంతో పార్కు వారి వాహనంలోనే తిరుగు ప్రయాణమయ్యాం.

సెంట్రల్, సౌత్ అమెరికాలలో అందరూ ఎక్కువగా స్పానిషే మాట్లాడతారు. ఇంగ్లీష్ అంతంత మాత్రమే వస్తుంది. కాని మా గైడ్ మాత్రం చక్కటి ఇంగ్లీష్‌లో తన గురించి చాలా కబుర్లు చెప్పింది. డిసెంబర్ నుంచి మే నెల వరకూ మాత్రమే కోస్టా రికాలో సందర్శకుల హడావిడి ఉంటుంది కాబట్టి ఆ ఆరు నెలలు కష్టపడి పనిచేసి డబ్బు కూడబెట్టుకుంటామని చెప్పింది. అక్కడ మాకు తారసపడిన స్థానిక వర్కర్లందరిదీ ఇంచుమించు ఇదే కథ. మన దేశంలో లాగానే ఆర్థిక అసమానతలెక్కువైనా, వారికి ప్రాథమిక విద్య, వైద్యం, ఇతర సదుపాయాలు అందుబాటులో ఉండటం వల్లనేమో, ప్రపంచలోకెల్లా అత్యంత సుఖశాంతులు ఉన్న దేశంగా (World's Happiest Nation) పేరు తెచ్చుకుంది.


పక్షులనిలా ఆకర్షిస్తారు

### తల్లి తాబేలు కోసం ఎదురుచూపులు

మర్నాడు బీచ్ రిసార్టులకు ప్రసిద్ధమైన 'టామరిండో'లో ఒక రోజు, All Terrain Vehicle (ATV) లో అడవిలో మా అంతట మేము తిరుగుతూ ఒకరోజు బాగా ఎంజాయ్ చేశాం. ఆ రాత్రి 'టర్టిల్ నెస్టింగ్' (సముద్రపు తాబేళ్లు గుడ్లు పెట్టే ప్రక్రియ)

చూడటానికి హోటల్లోనే పాకేజ్ బుక్ చేసుకున్నాం. దీని గురించి కొంత చెప్పాలి. ఈ సముద్రపు తాబేళ్లు గాలాపోగస్, కాలిఫోర్నియా లాంటి ఎంతో దూరప్రదేశాల నుంచి తమ పుట్టినిల్లయిన కోస్టారికా పసిఫిక్ మహాసముద్రపు బీచులకి తరలి వచ్చి, ఇక్కడ గుడ్లు పెట్టి తిరిగి సముద్రంలోకి వెళ్లిపోతాయి (ఆలివ్ రిడ్లీ తాబేళ్ళు ఇండియాలోని ఒడిషా తీరానికి వచ్చినట్టుగానే). ఇవి సాధారణంగా రాత్రి పూట మాత్రమే సముద్రం లోంచి బయటకు వచ్చి, కొద్దిగా ఎత్తయిన బీచ్ స్థలంలో ఒక గుంట తవ్వి ఒకేసారి 50 నుంచి వంద గుడ్ల వరకూ పెట్టి, ఆ గుంటని పూడ్చేసి తిరిగి వెళ్ళిపోతాయి. స్థానిక గైడ్ మాటలను బట్టి ఈ తాబేళ్ల రాకపోకలు రానురానూ తగ్గిపోతున్నాయి. దీనికి కారణం బీచ్ వెంబడి కొత్త కొత్త హోటళ్లు, రెస్టారెంట్లు, లగ్జరీ ఇళ్లు రావటమే. వాటిలో రాత్రింబవళ్ళు దీపాలు వెలుగుతుంటే తాబేళ్ళు అసలటు రావు. కాంతి తాబేళ్లకు అస్సలు పడదు.

ఆ రాత్రి చిమ్మ చీకటిలో మేమంతా బీచిలో చేరి తాబేళ్ల కోసం వేచిచూస్తూ కూర్చున్నాం. ఆకాశంలో ఆ రోజు మేము చూసినన్ని నక్షత్రాలు ఇంతకు మునుపు ఎప్పుడూ చూడలేదనిపించింది. తాబేళ్ళకి చెవులు ఉండవు కాబట్టి మేము కబుర్లు చెప్పుకోవచ్చుట గానీ, సెల్ ఫోన్లు , కెమెరా ఫ్లాషులు మాత్రం వాడకూడదని నిబంధనలు పెట్టాడు మా గైడ్. ఒక గంట తరవాత గైడ్ దగ్గర రేడియో మోగటంతో హడావిడి మొదలయ్యింది. పక్క బీచిలో తాబేలు కనపడిందిట! అందరం మా సెల్ ఫోన్ల వెలుగులో ఆత్రంగా ఆ బీచి వైపు పరుగెత్తాం. పది నిమిషాల తరువాత, మా గైడ్ మమ్మల్ని లైటు ఆపేయమని చెప్పి రెడ్ లైట్ వెలిగించాడు. తాబేళ్లు ఎర్ర కాంతిని చూడలేవు(ట). అప్పుడు కనపడిందా సముద్రపు తాబేలు. ఒక చిన్న గుంట తవ్వి, కింద రాయి తగలటంతో నెమ్మదిగా వెనుదిరిగి సముద్రంలోకి వెళ్ళిపోతోంది. మేము దాని వెనకాలే వెళ్ళి ఆ ఎర్ర లైటులోనే కొన్ని ఫోటోలు తీసుకున్నాం. ఈ అనుభవాన్ని కూడా మర్చిపోలేని ఘట్టాల చిట్టాలో వేసుకున్నాం. మనం పనులు ఇతర జీవరాశిపై ఎంతటి ప్రభావం చూపిస్తాయో ఆలోచింపజేసే క్షణాలు అవి.

## అరీనాల్ అగ్నిపర్వతం

అయిదవ రోజు ఉదయం తొమ్మిదింటికల్లా బయల్దేరి మూడున్నర గంటల ప్రయాణం తరవాత మా ఆఖరి మజిలీ 'అరీనాల్' అగ్నిపర్వత ప్రాంతానికి చేరుకున్నాం. అక్కడ మేమున్న హోటల్ ఒక చిన్న కొండ మీద ఎంతో అందమైన ప్రదేశంలో ఉంది. ఆరేళ్ళ క్రితం వరకూ అక్కడ ఒక అగ్నిపర్వతం లావా చిమ్ముతూ ఉండేది. ఇప్పుడు అది నిద్రాణమై ఉంది. మేము వెళ్ళింది క్రిస్మస్ రోజున కావడంతో పండగ జరుపుకుందామని పక్కనే ఉన్న ఒక చిన్న పల్లెటూరిలోని రెస్టారెంట్‌కి వెళ్ళాం. అక్కడ స్పానిష్ సంగీతం, వారి భోజనం, స్థానిక వైన్‌తో సరదాగా గడిపాము.



రాపెల్లింగ్‌కి సిద్ధంగా...



అడవి మధ్యలో వేలాడుతూ...



'బాడ్జర్'... దగ్గరకెళ్తే డేంజర్

మర్నాడు మా హోటల్ వాళ్ళు చక్కని బ్రేక్ఫాస్ట్ అందించారు. తోటల్లో పండే పళ్ళని చాలా అందంగా కోసి మాకు పెట్టడమే కాక తమ లోగిల్లోని చెట్లకి తగిలిన కొన్ని పళ్ళని గుచ్చి మా కోసం రకరకాల పక్షులను ఆకర్షించారు. కొద్ది నిమిషాల్లోనే ఎంతో అలవాటు పడినట్లుగా రంగురంగుల పక్షులు అనేకం వచ్చి మాతో బాటు తమ ఫలహారం కానిచ్చాయి.

ఆ తరువాత మేమందరం తయారయ్యి 'లా ఫార్చునా' లోని హాట్ స్ప్రింగ్‌లకి బయలుదేరాం. సరాసరి నేలలోంచి వచ్చే వేడి నీటిలో కాకుండా, ఆ నీటిని మళ్లించి మనం జలకాలాడటానికి అనువుగా తయారుచేసే రిసార్టులు అక్కడ అనేకం ఉన్నాయి. మేము 'ఎకో థర్మాలిస్' అనే రిసార్టుకి వెళ్ళాం. అక్కడ ఒక అరడజను హాట్ స్ప్రింగ్ పూల్స్ ఉన్నాయి. నీటి ఉష్ణోగ్రత 45 డిగ్రీల నుంచి 35 డిగ్రీల వరకూ ఉంది. వాటిల్లో రెండు గంటలు గడిపిన తరువాత 'రాపెల్లింగ్'కి బయల్దేరాం.

## రాపెల్లింగ్

ఇక్కడికి వచ్చేవరకూ మాకు 'రాపెల్లింగ్' అనే పదంతో లేదు. మామూలుగా తాళ్లతో కొండలు ఎక్కటాన్ని 'రాక్ క్లయింబింగ్' అంటారు కదా. తాళ్లతో కొండలు దిగటాన్ని 'రాపెల్లింగ్' అంటారని తెలుసుకున్నాం. కానీ ఇక్కడి ప్రత్యేకత మనలను కొండల పైనుండి జలపాతంలోకి తాళ్లు కట్టి దింపటం. మాలో ఎత్తులంటే భయమున్న ఇద్దరు మేము దిగమని చేతులెత్తేసినా గైడ్లు మేమున్నామని గట్టిగా భరోసా ఇవ్వటంతో సరేనని పిల్లలతో సహా అందరం ఈ సాహసానికి నడుంకట్టాము.

ముందుగా అందరికీ అన్నం, బీన్సు, పళ్లరసాలతో భోజనం పెట్టి, ఒక వ్యాన్‌లో ఎక్కించుకొని దట్టమైన అడవుల్లోకి తీసుకెళ్లారు. వర్షం కుండపోతగా కురుస్తున్నా చలి అంతగా లేకపోవటంతో ఒక రకమైన ఉద్వేగంతో కూడిన ఉత్సాహం అందరిలోనూ ప్రవేశించింది. మా అందరికీ బాడీ హార్నెస్లు, హెల్మెట్లు వగైరా రక్షణ సామాగ్రి తగిలించి మొదటి జలపాతం దగ్గరకి తీసుకెళ్లారు. నీళ్ళు ధారగా కిందకు పడుతున్నాయి, ఆ శబ్దమూ బాగా వినపడుతోంది, కానీ అది ఎంత లోతో మాత్రం కొండ చివరకు వెళ్ళేదాకా తెలిసే అవకాశం లేదు. కొండ చివరకి చేరుకున్నాక కూడా లోతు ఎంతో చూసే అవకాశం ఇవ్వకుండా గైడు వెనక్కి తిరిగి నించోమని చెప్పి మారు ప్రశ్నలడిగేలోగా నన్ను చిన్నగా ఒక నెట్టు నెట్టాడు. ఒక్క ఉదుటున క్రిందకి జారాను. భయంతో తాడు గట్టిగా పట్టుకోవటంతో జారడం ఆగిపోయి సరాసరి ఆ జలపాతం నీళ్ళ దగ్గరికి వెళ్ళిపోయాను. అయితే పక్కనున్న రాళ్లకు కొట్టుకోకుండా కాళ్లతో ఆపుకున్నాను. పైనుంచీ, కిందనుంచీ కూడా గైడ్లు తాడుని వదలమని అరవడంతో నెమ్మదిగా తాడుని వదిలి కొద్ది క్షణాలలో కింద వున్న నీళ్ల దగ్గర వాలాను. అప్పుడు పైకి చూస్తే తెలిసింది, ఆ గైడ్లు మనని ఎత్తూ, లోతూ ఎందుకు పరిశీలించనివ్వరో! ఈలోగా వర్షం ఇంకా ఎక్కువైంది. అయినా మరో నాలుగు చిన్న జలపాతాల దగ్గర కూడా ఇలాగే దూకాం. ఈ సాహసానికి కూడా మేమంతా 'most thrilling' అనుభవంగా ఓటు వేసేశాం. టూరు అయిపోగానే మాకు టవల్సుతో పాటు వేడి కాఫీ, బిస్కట్లు ఇచ్చి మా మనసు గెలుచుకున్నారు ఈ 'ప్యూర్ ట్రెక్' వాళ్ళు.

చివరిగా 'anywhere.com' వాళ్ళు ఇచ్చిన సహాయ సహకారాల గురించి చెప్పుకోవాలి. మొదట్నించి వాళ్ళ గైడెన్స్ తీసుకుని ఉంటే మరిన్ని మంచి అనుభవాలు మూటగట్టుకునే పని. ఏదేమైనా అనేక కొత్త అనుభూతులతో తిరిగొచ్చాం.

**- శివ సోమయాజుల,** syaji0@gmail.com

# 'ఈవెంట్' మర్డర్

**మంచు దుప్పటి కప్పుకున్నట్టుంది గండిపేట.**

**ఆ చలిలో రోజులాగే జాగింగ్ చేస్తున్న రమేష్‌కు రోడ్డు పక్కనున్న పొదల్లో బూటు కాళ్లు కనిపించాయి.**

**భయం భయంగానే దగ్గరకు వెళ్లాడు.**

**గుబురుగా ఉన్న పొదలను చేతిలో ఉన్న కర్రతో పక్కకు జరిపి, అక్కడ కనిపించిన దృశ్యాన్ని చూసి కెవ్వుమని కేక వేశాడు.**

**భయంతో అరుస్తూ రోడ్డుపై పరుగెత్తాడు.**

పెట్రోలింగ్ పోలీసులు రమేష్ అరుపులు విని అక్కడకు వచ్చారు.

"ఏమైంది? ఎందుకలా అరుస్తున్నారు?" అంటూ పోలీసులు ప్రశ్నించడంతో ఆయాసంతో నోట్లోంచి మాట రాక పొదలవైపు చేయి చూపించాడు రమేష్.

పొదల మాటున నడుము పైభాగం నుంచి కాలిన స్థితిలో ఉన్న మహిళ మృతదేహం కనిపించింది.

పోలీసులు వెంటనే ఇన్‌స్పెక్టర్‌కు ఫోన్ చేశారు.

"సార్... గండిపేట చౌరస్తాలో, పొదల్లో ఒక లేడీ డెడ్ బాడీ ఉంది" అని చెప్పారు.

మరో పది నిమిషాల్లో మొయినాబాద్ ఇన్‌స్పెక్టర్ శేఖర్‌గౌడ్ పోలీస్ జీప్‌లో అక్కడకు చేరుకున్నారు. క్లూస్ టీం, డాగ్ స్క్వాడ్‌ను కూడా రప్పించారు.

పాతికేళ్లలోపు వయసున్న మహిళను ఎక్కడో హత్య చేసి ఇక్కడకు తీసుకువచ్చి, ఆమె ఎవరో గుర్తించకుండా ఉండేందుకు తగలబెట్టడానికి ప్రయత్నించారని ప్రాథమికంగా తేల్చారు. ముఖం పూర్తిగా కాలిపోవడంతో నిజంగానే గుర్తుపట్టడానికి వీలు లేకుండా ఉంది.

•••

మొయినాబాద్ పోలీస్‌స్టేషన్ పరిధిలో గుర్తుతెలియని మహిళ మృతదేహం కనిపించిందని, ఆమె ఒంటి మీదున్న దుస్తుల వివరాలతో అన్ని పోలీస్‌స్టేషన్లకు మెసేజ్ పంపించారు పోలీసులు. ఎక్కడైనా మహిళా మిస్సింగ్ కేసు నమోదై ఉంటే వెరిఫై చేయమని కోరారు.

24 గంటలు గడిచాయి...

హుమయూన్‌నగర్ పోలీస్‌స్టేషన్‌లో మిస్సింగ్ ఫిర్యాదు ఇచ్చిన ఒక మహిళ ఇన్‌స్పెక్టర్ శేఖర్‌గౌడ్ ముందు నిల్చుంది.

ఆయన చూపించిన దుస్తులు, బూట్లను చూసి ఒక్కసారిగా కన్నీరుమున్నీరైంది.

ఇవి తన బిడ్డ సానియా బట్టలే అని, రెండు రోజుల నుంచి కూతురు కనిపించడం లేదని, తన బిడ్డను చంపేసారంటూ ఏడుస్తూ కుప్పకూలిపోయింది.



మహిళా కానిస్టేబుళ్లు ఆమెను ఓదార్చి వివరాలు తెలుసుకోవడానికి ప్రయత్నించారు.

"సార్... మేము మాసబ్‌ట్యాంక్‌లోని ఒక అపార్ట్‌మెంట్‌లో ఉంటున్నాం. మా ఆయన దుబాయ్‌లో పనిచేస్తున్నాడు. నా బిడ్డ సానియా ఈవెంట్ మేనేజర్‌గా పనిచేస్తుంది. రెండు రోజులు క్రితం... సాయంత్రం పూట మా అమ్మాయికి ఫోన్ వచ్చింది ఈవెంట్ ఉందని... కారు వచ్చింది... నేను వెళ్తున్నా అంటూ వెళ్లింది..."

"సాధారణంగా సిటీలో ఈవెంట్స్ రాత్రి పూటే జరుగుతాయి కదా..."

"అవున్సార్... ఈవెంట్ ఉన్నప్పుడు బయటకు వెళ్లడం, ఓ రోజు తర్వాత ఇంటికి రావడం మామూలే. ఆ రోజు మాత్రం ఒక్కసారి కూడా నాకు ఫోన్ చేయలేదు. నేనే ఉండబట్టలేక ఐదారు గంటల తర్వాత పార్టీ ఎక్కడ జరుగుతుందో తెలుసుకుందామని ఫోన్ చేశా. ఫోన్ స్విచ్ఛాఫ్ వచ్చింది. ఆ తర్వాత కూడా చాలాసార్లు ఫోన్ ట్రై చేసి చివరికి హుమయూన్‌నగర్ పోలీసుస్టేషన్‌లో ఫిర్యాదు చేశాను" అని ఏడుస్తూ చెప్పింది సానియా తల్లి.

"మీకెవరి మీదనైనా అనుమానం ఉందా? సానియా పని చేస్తున్న ఈవెంట్ కంపెనీ వాళ్లను అడిగారా?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"నాకు ఎవరి మీదా అనుమానం లేదు. సానియా ఈవెంట్ కంపెనీ యజమాని జీషన్‌కి ఫోన్ చేస్తే ఆ రోజు ఈవెంట్స్ ఏమీ లేవని, తమ వద్దకు రాలేదని చెప్పాడు"

"ఓకే. అర్జెంట్‌గా సానియా ఫోన్ కాల్ డీటెయిల్స్ తెప్పించండి" అని క్రైమ్ పోలీసులను ఆదేశించాడు ఇన్‌స్పెక్టర్ శేఖర్‌గౌడ్. మరో ఇద్దరు కానిస్టేబుళ్లను పిలిచి సానియా పనిచేసిన ఈవెంట్ కంపెనీ దగ్గరకు వెళ్లి విచారణ జరపమని చెప్పారు.

•••

సానియా సెల్‌ఫోన్‌కు ఆమె ఇంటి నుంచి వెళ్లిన రోజు వచ్చిన ఫోన్‌కాల్స్‌ను పరిశీలించసాగాడు ఇన్‌స్పెక్టర్.

సానియా ఇంట్లోంచి వెళ్లిన సమయానికి సరిగ్గా పదినిమిషాల ముందు ఓ నెంబర్ నుంచి కాల్ వచ్చింది. 42 సెకన్లు మాట్లాడిందామె. ఆ తర్వాత గంట వ్యవధిలో మరో రెండు నెంబర్ల నుంచి ఫోన్స్ వచ్చాయి. ఆ తర్వాత ఫోన్ స్విచ్ఛాఫ్ అయింది. సానియా ఇంటి నుంచి టోలిచౌకి, అక్కడి నుంచి గండిపేట, అక్కణ్నుంచి మొయినాబాద్... మళ్లీ గండిపేట వచ్చినట్లు సెల్‌ఫోన్ టవర్ లోకేషన్స్ స్పష్టం చేస్తున్నాయి. గండిపేటలోనే ఫోన్ స్విచ్ఛాఫ్ అయింది. అంటే సానియాతో పాటు వచ్చిన వాళ్లు ఈ ప్రాంతంలోనే తిరిగి ఉండాలి... ఇక్కడే ఏదో జరిగింది... అదేంటో తెలుసుకునే పనిలో పడ్డారు ఇన్‌స్పెక్టర్ శేఖర్‌గౌడ్.

•••

ఈవెంట్ కంపెనీ వద్దకు ఎంక్వయిరీకి వెళ్లిన కానిస్టేబుళ్లు మరిన్ని వివరాలు రాబట్టారు.

"సార్... సానియా పనిచేస్తున్న కంపెనీకి జీషన్, హుస్సాఖాన్‌లు యజమానులు. ఆ ఈవెంట్ మేనేజ్‌మెంట్ కంపెనీలో 30 మందికి పైగా పనిచేస్తున్నారు. క్యాటరింగ్ సర్వీస్ నుంచి ఆర్కెస్ట్రా వరకు వాళ్లే చూసుకుంటారు" అంటూ జీషన్, హుస్సాఖాన్‌ల ఫోన్‌నెంబర్లను ఇన్‌స్పెక్టర్‌కు ఇచ్చాడు కానిస్టేబుల్.

ఆ రెండు ఫోన్‌నెంబర్లను సానియా కాల్ డీటైల్స్‌తో మ్యాచ్ చేసి చూస్తున్న ఇన్‌స్పెక్టర్‌కు జీషన్ ఫోన్ నుంచి సానియాకు చాలా సార్లు ఫోన్లు వచ్చినట్టు స్పష్టంగా కనిపించింది. వాళ్లిద్దరూ గంటలకొద్దీ ఫోన్‌లో మాట్లాడుకున్నట్లు కాల్ రికార్డ్స్ కనిపించాయి.

•••

ఎంక్వయిరీ ఊపందుకుంది. ఇన్‌స్పెక్టర్ ముందు జీషన్ చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

"సార్... సానియా మా దగ్గర పనిచేస్తుంది. మంచి అమ్మాయి. మేం జీతం బాగానే ఇచ్చేవాళ్లం. ఆ రోజు అసలు మా దగ్గర ఈవెంటే లేదు. ఎక్కడకు వెళ్లిందో నాకూ అర్థం కావడం లేదు"

అన్నాడు జీషన్.

"అదేంటీ! నీకు చెప్పకుండా తనేం చేయదనుకుంటా! మీ ఇద్దరు మంచి ఫ్రెండ్స్ కదా..." అని ఇన్‌స్పెక్టర్ అనడంతో జీషన్ ఉలిక్కిపడ్డాడు.

"అన్ని విషయాలు నాకెందుకు చెప్తుంది సార్... జస్ట్ ఆమె మా దగ్గర ఉద్యోగి మాత్రమే..."

జీషన్ మాట పూర్తికాకుండానే అతడి చెంప చెళ్లుమనిపించాడు ఇన్‌స్పెక్టర్.

"ఏరా! తమాషా చేస్తున్నావా? ఆ అమ్మాయికి, నీకు ఏం సంబంధం లేదా?" అని గద్దించాడు. దాంతో జీషన్ నీళ్లు నములుతూ "ఆమె.. నా ఫ్రెండ్... ఇద్దరం క్లోజ్‌గా ఉంటాం. ఇద్దరం పెళ్లి చేసుకుందామనుకున్నాం. అలాంటి అమ్మాయిని నేనెందుకు చంపుతాను సార్..." అంటూ కన్నీరుమున్నీరయ్యాడు జీషన్.

●●●

ఈ లోపు పత్రికల్లో రోజుకో కథనం వస్తోంది. జీషన్‌తో సానియా సాన్నిహిత్యం మీద కూడా కథనాలు వండి వార్చాయి. జీషన్ పైనే అనుమానాలన్నీ... సస్పెన్స్ కొనసాగుతోంది.

మరికొందరు ఈవెంట్ కంపెనీ వర్కర్లను పోలీస్‌స్టేషన్‌కు తీసుకువచ్చారు.

"అందరికీ ఇంకో రెండు కోటింగ్‌లు ఇవ్వండి..." అంటూ లాఠీ విసిరేసి లాకప్‌రూంలో నుంచి బయటకు వచ్చాడు ఇన్‌స్పెక్టర్ శేఖర్. కొద్దిసేపు అరుపులతో లాకప్ దద్దరిల్లింది.

దాంతో పోలీసులకు మరిన్ని విషయాలు తెలిశాయి.

●●●

మొయినాబాద్ పోలీస్‌స్టేషన్ విలేకరులతో కిక్కిరిసిపోయింది. సానియా హత్యకేసు రోజుకో కథనంతో సంచలనం సృష్టించిన నేపథ్యంలో మీడియా ఆసక్తి ఎక్కువైంది.

విలేకరుల సమావేశాన్ని ప్రారంభించారు డీసీపీ రమేష్ నాయుడు.

"సానియా కేసులో మీరంతా ఊహించి రాసినట్లు జీషన్ నిందితుడు కాదు... అసలు అతనికేం తెలీదు..."

"జీషన్‌తో సానియా క్లోజ్‌గా ఉంది కదా. ఆమెను హత్య చేసే అవసరం ఇంకెవరికి ఉంది?" ఓ విలేకరి ప్రశ్నించాడు.

"జీషన్‌కు నీడలా ఉంటూ అతణ్ని నమ్మించి నట్టేట ముంచిందో కిలాడీ..."

ఈ మాట వినగానే ఒక్కసారిగా అంతా ఆశ్చర్యపోయారు.

"నిజానికి ఇదో ట్రయాంగిల్ లవ్‌స్టోరీ. సానియాను హత్య చేసింది మహిళనే. ఆమె ఎవరో కాదు జీషన్ బిజినెస్ పార్ట్‌నర్ హుస్నాఖాన్. అతడికి ఒక పార్టీలో హుస్నాఖాన్ పరిచయమైంది. అతని చలాకీతనం చూసి మురిసిపోయింది... ఆ తర్వాత దగ్గరైంది. అప్పటికే ఇద్దరు పిల్లల తల్లి ఆమె. అయితే భర్త విదేశాల్లో ఉండేవాడు. భర్త పంపించే డబ్బును ఈ వ్యాపారంలో పెట్టుబడిగా పెట్టింది ఆమె. ఇటు వ్యాపారం... అటు జీషన్‌తో చాటుమాటు వ్యవహారం సాఫీగా నడిచేది. ఇంతలో సానియా సీన్‌లోకి ఎంటరైంది. ఆమె జీషన్‌కు దగ్గరవుతుండటంతో హుస్నాఖాన్ రగిలిపోయింది. అవసరం కోసం మాత్రమే హుస్నాఖాన్‌తో శారీరక సంబంధం పెట్టుకున్న జీషన్ సానియాకు దగ్గరయ్యాక హుస్నాఖాన్‌పై శ్రద్ధ తగ్గించాడు. దాంతో ఈ లోకం నుంచే సానియాను తప్పించాలనుకుంది హుస్నాఖాన్. తమ కంపెనీలోనే పనిచేస్తున్న ఇద్దరు కుర్రాళ్లు మాలిక్, రెహమాన్‌లపై డబ్బు, వలపు వల విసిరింది. ఆమె మాయలో పడిన ఆ కుర్రాళ్లు హుస్నాఖాన్ చెప్పినట్టు చేయడానికి రెడీ అయ్యారు. అంతే...



ముగ్గురూ కలిసి మర్డర్ ప్లాన్ వేశారు..."

"జీషన్ ఆ రోజు ఈవెంట్స్ ఏవీ లేవన్నాడు... మరి సానియా ఈవెంట్ కోసం వెళ్లినట్టు ఆమె తల్లి చెబుతోంది కదా" సందేహాన్ని వ్యక్తం చేశాడు ఇంకో విలేకరి.

"అక్కడికే వస్తున్నా... అప్పుడప్పుడు సానియా మిగతావారితో కలిసి వేరే ఈవెంట్లకు కూడా వెళుతుంటుంది. అందుకే ఈవెంట్ ఉందని మాలిక్‌తో ఫోన్ చేయించింది హుస్నాఖాన్. మాలిక్ బాగా తెలిసిన వ్యక్తే కావడంతో సానియా ఈవెంట్‌కు వెళ్లడానికి ఒప్పుకుంది. మాలిక్ తీసుకెళ్లిన కారులో ఎక్కాక కారులో హుస్నాఖాన్‌ను చూసి ఆశ్చర్యపడింది. అయితే ఆ ప్రైవేట్ పార్టీ తన బంధువులకు చెందింది అని హుస్నాఖాన్ చెప్పడం... కారులో మాలిక్, రెహమాన్ కూడా ఉండటంతో వాళ్లను నమ్మింది సానియా.

వారంతా మాసబ్‌ట్యాంక్ నుంచి టోలిచౌకిలోని ఓ హోటల్‌కు వెళ్లారు. అక్కడ భోజనం చేశారు. ఒక పెట్రోల్ బంక్‌లో కారులో పెట్రోల్ పోయించుకున్నారు. ఒక సీసాలో రెండు లీటర్ల పెట్రోల్ విడిగా నింపుకున్నారు. అక్కణ్నుంచి మాలిక్ కారును గండిపేట మీదుగా మొయినాబాద్ వైపు మళ్లించాడు. మొయినాబాద్‌లోని ఓ నిర్మానుష్య ప్రాంతంలో కారును ఆపారు. సానియా పక్కన కూర్చున్న హుస్నాఖాన్ జీషన్‌ను వదిలేయమని వార్నింగ్ ఇచ్చింది. వదిలేయకపోతే అంతు చూస్తానని బెదిరించింది. సానియా సీరియస్‌గా తీసుకోకుండా మామూలుగా బెదిరిస్తున్నారనుకుంది. కిందకు దిగి వెళ్లిపోవడానికి ప్రయత్నించింది. అంతే... ఒక్క ఉదుటున హుస్నాఖాన్ సానియా గొంతుకు చున్నీతో ఉరి బిగించింది. సానియా పెనుగులాడటంతో మాలిక్, రెహమాన్ ఆమె కదలకుండా కాళ్లు, చేతులు పట్టుకున్నారు. కాసేపు ఊపిరాడక గిలగిలా కొట్టుకున్న సానియా ఆ తర్వాత కొద్ది సెకన్లలోనే ప్రాణం కోల్పోయింది. ముగ్గురూ కలిసి సానియా మృతదేహాన్ని కారులోనే ఉంచుకుని గండిపేటకు చేరుకున్నారు. అక్కడ పొదల్లో సానియా మృతదేహాన్ని పడేసి పెట్రోల్ పోసి నిప్పంటించి పరారయ్యారు. ఆధారాలు దొరకకుండా చేశామని వారు అనుకున్నప్పటికీ సానియా సెల్‌ఫోన్ కాల్ డిటెల్స్‌ని రెహమాన్, మాలిక్, హుస్నాఖాన్ ఫోన్‌కాల్స్‌తో మ్యాచ్ చేసినప్పుడు మాకు అనుమానం కలిగింది. ఆ అనుమానంతో మొదలైన విచారణలో అసలు హంతకులెవరనేది చివరికి తేలింది" అంటూ విలేకరుల సమావేశాన్ని ముగించారు డీసీపీ.

**విలేకరుల సమావేశాన్ని ప్రారంభించారు డీసీపీ రమేష్ నాయుడు. "సానియా కేసులో మీరంతా ఊహించి రాసినట్లు జీషన్ నిందితుడు కాదు... అసలు అతనికేం తెలీదు..."**

**"జీషన్‌తో సానియా క్లోజ్‌గా ఉంది కదా. ఆమెను హత్య చేసే అవసరం ఇంకెవరికి ఉంది?" ఓ విలేకరి ప్రశ్నించాడు.**

**- వేముల సత్యనారాయణ, 99854 88800**

కూర రుచిగా ఉండాలని నూనె ఎక్కువ వేసేస్తుంటారు కొంతమంది. కొన్నిసార్లు వండేటప్పుడే అనుకోకుండా అవసరమైన దానికంటే ఎక్కువ నూనె పడుతుంటుంది. నెయ్యి, నూనెలాంటి కొవ్వు పదార్థాలను అధికంగా వాడడం వల్ల గుండె జబ్బులు, స్థూలకాయం వచ్చే ప్రమాదం ఉంటుందని తెలిసినా నోటిని అదుపు చేసుకోలేరు చాలామంది. ఇలా అధికంగా ఉండే కొవ్వును తీసివేసేందుకు



# కూరల్లో కొవ్వును తగ్గిస్తాయి..





ఉపయోగపడే రెండు పరికరాలు కొత్తగా వచ్చాయి. అవి- 'ఫ్యాట్ మ్యాగ్నెట్' (fat magnet), 'గ్రేవీ సెపరేటర్' (Gravy Separator). కూర వండిన తర్వాత దానిపైన ఫ్యాట్ మ్యాగ్నెట్‌ను పెట్టి బటన్ నొక్కితే కూరలో అధికంగా ఉన్న నూనెను తీసేస్తుంది అది. అధికంగా ఉండే నూనె మాత్రమే పోతుంది కాబట్టి రుచిలో ఎటువంటి మార్పు ఉండదు. అధిక బరువుతో బాధపడుతూ ఇష్టమైన వంటకాలను తినలేక నోటికి తాళం వేసుకున్నవారికి ఈ ఫ్యాట్ మ్యాగ్నెట్ బాగా ఉపయోగపడుతుంది. 'గ్రేవీ సెపరేటర్'.. గ్రేవీలో అధికంగా ఉండే నూనెను తేలికగా వేరుచేసేందుకు ఉపయోగపడుతుంది. గిన్నెను వంచినా, గరిటెతో తీసినా కూరలో కలిసిపోయిన నూనె పూర్తిగా బయటికి రాదు. గ్రేవీ మొత్తం గ్రేవీ సెపరేటర్‌లో పోస్తే నూనె దానంతటదే పైకి తేలుతుంది. దీనికి ఉండే పైపు ద్వారా దాన్ని తేలిగ్గా తీసేయొచ్చు. మిగిలిన గ్రేవీని కూరలో వాడుకోవచ్చు. మాడిపోయిన పోపుదినుసులను వేరుచేసేందుకు వీలుగా దీనికి జాలిని కూడా అమర్చారు.

ఇంటెక్

ఈ వస్తువులను వాటి పేరుతో నెట్‌లో సెర్చ్ చేసి, వివిధ ఆన్‌లైన్ సంస్థల ద్వారా కొనుగోలు చేయవచ్చు.

# చేపలను తేలిగ్గా శుభ్రం చేస్తుంది..



చేపల పులుసును లొట్టలేసుకుని తినేవాళ్లు కూడా పచ్చిచేపలను శుభ్రం చేయమంటే భయపడి పారిపోతారు. ఎందుకంటే చేపలను బండకేసి రాకాల్సి రావడం పెద్ద పని కాబట్టి. కాని చేప పొలుసులను సరిగ్గా శుభ్రం చేయకపోతే కూర రుచి చెడిపోతుంది, భరించలేని వాసన కూడా వస్తుంది. అలాంటి ఇబ్బందులను దూరం చేస్తుంది ఈ 'ఫిష్ స్కేల్ బ్రష్' (Fish Scale Brush). బండకు రాకాల్సిన అవసరం లేకుండా దీనితో చేపలపై రుద్దితే పొలుసులు తేలికగా ఊడివచ్చేస్తాయి. శుభ్రం చేసేవారి మీద పొలుసులు పడకుండా ఒక బాక్సును కూడా అమర్చారు. ఈ బ్రష్ వెనక భాగంలో చేపను ముక్కలు చేసేందుకు చిన్న కత్తి కూడా ఉంది.

# ఎక్కడున్నా పట్టేస్తుంది...

కళ్లజోడు, టీవీ రిమోట్, తాళం చెవులు వంటి వస్తువులను ఎక్కడో పెట్టి మరిచిపోవడం దాదాపు అందరికీ అలవాటే. ఎక్కడ పెట్టామో గుర్తురాక ఇల్లంతా వెతికేస్తుంటాం. పక్కనే ఉన్నా చూసుకోక తెగ గాభరా పడిపోతాం. ఆ కష్టం లేకుండా చేస్తుంది ఈ 'రిమోట్ వైర్‌లెస్ ఎల్‌ఈడీ కీ వ్యాలెట్ ఫైండర్' (Remote Wireless LED Key Wallet Finder). ముందుగా దీనిలో ఉండే ఒక చిన్న 'స్మార్ట్ కీ'ని ఆయా వస్తువులకు అమర్చాలి. అవి కనిపించనప్పుడు ఫైండర్‌కి అమర్చి ఉండే బటన్ నొక్కితే స్మార్ట్‌కీ అలారం మోగుతుంది. దీంతో అవి ఎక్కడున్నాయో తేలిగ్గా కనిపట్టేయొచ్చు. ఒక ఫైండర్ ద్వారా నాలుగు వస్తువులను కనిపెట్టేందుకు వీలుగా 4 స్మార్ట్ కీలను ఇస్తున్నారు.



## సైనస్ సమస్య మళ్లీ రాదు

**ముక్కు** కళ్ల చుట్టూ నాలుగు గదులుంటాయి. వాటిని సైనస్‌లు అంటారు. ఈ సైనస్‌లలో వైరల్, బాక్టీరియా, ఫంగల్ ఇన్‌ఫెక్షన్ కారణంగా విపరీతమైన నొప్పి పుడితే దాన్ని సైనసైటిస్ అంటారు.

**కారణాలు :** సైనస్ ముఖద్వారం మూసుకుపోతుంది లేదా అక్కడ చాలా మ్యూకస్ పేరుకుపోతుంది. ఫలితంగా అక్కడ బాక్టీరియా, ఇతర క్రిములు సులభంగా పెరిగి సైనసైటిస్ సమస్య మొదలవుతుంది. శ్వాసకోశ మార్గానికి ఇన్‌ఫెక్షన్ రావటం వల్ల సైనస్‌లకు బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వస్తుంది. ఫలితంగా సైనసైటిస్ మొదలవుతుంది.

**గుర్తించటం సులభం:** తరచు జలుబు చే యడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆ పైన ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. తీవ్రమైన తలనొప్పి, దగ్గు, శ్వాస దుర్గంధంతో కూడి ఉండటం కూడా జరుగుతుంది. ముఖంలో వాపు కనిపిస్తుంది. గొంతు మంటగా, నోరంతా చేదుగా మారుతుంది.

**సర్జరీ అవసరం లేదు :** హోమియోపతి చికిత్స వల్ల సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్‌ను సమూలంగా తగ్గించుకోవచ్చు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో చికిత్సతో సమస్య సమూలంగా తొలగిపోతుంది.

## హెపటైటిస్, హెర్పిస్‌కు చెక్ సాధ్యమే

**హెపటైటిస్** వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. హెపటైటిస్ వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.



## కిడ్నీలో రాళ్లకు ఆపరేషన్ ఎందుకు?

**ఏ** పనైనా సాఫీగా జరుగుతున్నంత సేపు ఏ ఇబ్బంది ఉండదు. ఏదైనా ఆటంకం ఏర్పడినప్పుడే దాని ప్రభావం ఏస్థాయిలో ఉంటుందో అర్థమవుతుంది. మూత్రవిసర్జన విషయంలోనూ అంతే. కిడ్నీలో ఏర్పడిన రాళ్లు మూత్రనాళంలో అడ్డుపడితే ఆ బాధ చెప్పనలవికాదు.

**కారణాలు :** శరీరంలో తయారయ్యే మలిన పదార్థాలన్నీ మూత్రం ద్వారానే బయటకుపోతాయి. మలినాలన్నీ కరిగిన స్థితిలో మూత్రం ద్వారా బయటకు వెళితే ఏ సమస్యా ఉండదు. అలా కాకుండా మూత్రం విసర్జన సాఫీగా జరగకపోతే గాఢత పెరిగిపోయి మలినాలు రాళ్లుగా ఏర్పడతాయి. సాధారణంగా కిడ్నీ స్టోన్స్ రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి కాల్షియం ఆక్సలేట్, యూరికాసిడ్. కొంతమందిలో మెటబాలిక్ సమస్య వల్ల కూడా రాళ్లు ఏర్పడతాయి.

**లక్షణాలు :** కిడ్నీలో ఏర్పడిన రాయి ఒక్కోసారి మూత్రనాళంలో అడ్డుపడుతుంది. ఫలితంగా కిడ్నీలో వాపు వస్తుంది. తీవ్రమైన నొప్పి, మూత్రంలో మంట, జ్వరం వంటి లక్షణాలు కనిపిస్తాయి. మూత్రంలో రక్తం కూడా రావచ్చు. మూత్రవిసర్జన సమయంలో తీవ్రమైన నొప్పి వస్తుంటుంది. నొప్పి వెనక నుంచి ముందుకు విస్తరిస్తూ ఉంటుంది.

**హోమియో వైద్యం :** ఆపరేషన్ కోసం పరిగెత్తకుండా హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా రాళ్లు సులభంగా తొలగిపోయేలా చూసుకోవచ్చు. మూత్రనాళంలో రాయి అడ్డుపడినట్లయితే హోమియో మందులు మూత్రనాళం వ్యాకోచం చెందేలా చేసి రాయి పడిపోయేలా చేస్తాయి. అంతేకాకుండా హోమియో మందులు శరీరతత్వాన్ని మార్చుతాయి. ఫలితంగా రాళ్లు తయారయ్యే అవకాశం తగ్గిపోతుంది. కిడ్నీలో రాయి ఉంది అనగానే గాభరా పడిపోకుండా అనుభవజ్ఞులైన హోమియో వైద్యున్ని సంప్రదిస్తే సమస్య ఇట్టే తొలగిపోతుంది.

## ఎసిడిటీని ఎన్నాళ్లు భరిస్తారు?

**ఎసిడిటీ, గ్యాస్ట్రైటిస్ :** జీవనశైలిలో మార్పులు అంటే సమయానికి భోజనం చేయకపోవడం, మసాలా, వేపుళ్లు ఎక్కువగా తీసుకోవడం, మాంసాహారం అధికంగా తినడం, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వంటివి గ్యాస్ట్రైటిస్ సమస్యకు కారణమవుతాయి.

**లక్షణాలు :** పుల్లటి తేన్పులు, వాంతులు, కడుపులో మంట, కడుపు ఉబ్బరం వంటి లక్షణాలుంటాయి. కొద్దిగా ఆహారం తీసుకున్నప్పటికీ పొట్ట నిండినట్లుగా అనిపించడం, ఆకలి లేకపోవడం, కారణం లేకుండానే బరువు తగ్గిపో తుండటం వంటి లక్షణాలు ఉంటాయి.

**చికిత్స :** రోగి లక్షణాలు, శారీరకపరిస్థితిని పరిశీలించి మందులు ఇవ్వాల్సి ఉంటుంది. చికిత్స తీసుకోవడంతో పాటు జీవనశైలిలో మార్పులు చేసుకున్నట్లయితే మంచి ఫలితం ఉంటుంది. వేళకు భోజనం చేయడం, కారం, ఉప్పు, నూనె తగ్గించడం చేయాలి.

**అల్సర్స్(గ్యాస్ట్రిక్, పెప్టిక్) :** మ్యూకస్ మెంబ్రేన్ యందు పుండులాగా కావడాన్ని అల్సర్ అంటారు. అల్సర్ ఏ భాగంలో అయితే ఆ పేరుతో పిలుస్తారు. ఆహారవాహికలో ఉన్నట్లయితే ఒసియోఫేగల్ అల్సర్, జీర్ణకోశంలో ఉన్నట్లయితే గ్యాస్ట్రిక్ అల్సర్, చిన్న పేగు మొదటి భాగంలో ఉన్నట్లయితే డ్యుయోడినల్ అల్సర్ అని పిలుస్తారు.

**లక్షణాలు :** తినేముందు లేదా తిన్న తరువాత కడుపులో నొప్పి, కడుపు ఉబ్బరంగా ఉండటం, పుల్లటి తేన్పులు, తలతిరగడం, వాంతులు వంటి లక్షణాలు ఉంటాయి. వ్యాధి ముదిరినపుడు రక్తంతో కూడిన వాంతులు, భరించలేని కడుపునొప్పి, బరువు తగ్గిపోవడం జరుగుతుంది.

**చికిత్స :** అల్సర్‌ను సమూలంగా తొలగించే మందులు హోమియోలో ఉన్నాయి. ఆహారపు అలవాట్లు మార్చుకొని క్రమం తప్పకుండా మందులు వాడినట్లయితే సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది.

ADVT

## బేతాళ ప్రశ్న-18

నేను ఒక వస్తువుని. నన్ను తయారుచేసే వాళ్లకి నా అవసరం ఉండదు. కొనేవాళ్లు కూడా నన్ను ఉపయోగించరు. నన్ను ఎవరు వాడతారో వాళ్లు నన్ను చూడనే చూడరు. ఇంతకీ నేనెవరిని?

**సమాధానం వచ్చేవారం!**

**మీ దగ్గర ఇలాంటి మెదడుకు మేతవేసే ప్రశ్నలు, భేతాళ ప్రశ్నలు ఉంటే జవాబుతో పాటు మా ఈమెయిల్ kerintha.aj@gmail.com కు పంపించగలరు**

**గతవారం సమాధానం:**
రోమన్ అంకెల్లో తొమ్మిది (IX) లో ఉన్న ఒకటి (I) తీసేస్తే పది (X) వస్తుంది.

**బేతాళ ప్రశ్న- 16 కు సరైన సమాధానం పంపిన మొదటి ముగ్గురు:**
**బి. చైతన్యకుమార్, ఈమెయిల్,**
**ఎర్రబెల్లి భానుతేజ, ఈమెయిల్,**
**మంగ గీతాంజలి, ఈమెయిల్.**






## తెల్లమీసాల పక్షి





నల్లటి దేహం, ఎర్రటి ముక్కు, దానిపైన మెలితిప్పిన తెల్లని మీసాలతో చూడగానే ఆకర్షిస్తుందీ వింత పక్షి. ఒకప్పుడు దక్షిణ అమెరికాలో 'ఇన్‌కా' నాగరికత విలసిల్లిన ప్రాంతమే దీని జన్మస్థానం. అందుకే ఈ పక్షికి 'ఇన్‌కా టెర్న్' అని పేరు పెట్టారు. ఈ పక్షుల్లో మగ, ఆడ తేడా లేకుండా రెండిటికీ మీసం ఉంటుంది. పసిఫిక్ సముద్ర తీరాన పెరూ, చిలీలలో ఇవి ఎక్కువగా కనిపిస్తాయి. ఇవి లవణీయత తక్కువగా ఉన్న చల్లటి ప్రవాహల దగ్గరే కనిపిస్తాయి. గాల్లో ఎగురుతూనే సముద్రజలాల్లో ఉన్న చిన్న చిన్న చేపలను గుర్తించి, వేగంగా నీటమునిగి చేపలను పట్టేస్తాయి. వీటి కూత పిల్లి అరుపులా ఉండటంతో కొంతమంది వీటిని 'పిల్లి కూత పక్షి' అని కూడా పిలుస్తారు.

## రికార్డుల రారాజు



సురేష్ వకీమ్ సినిమా యాక్టర్ కమ్ డైరెక్టర్. కెనడాలో ఉండే తమిళుడు. చాలామంది ఒక్కసారైనా గిన్నిస్‌బుక్‌లో పేరు చూసుకోవాలని ప్రయాస పడుతుంటే... రికార్డులు సృష్టించడం నీళ్లు తాగినంత సులభంగా రికార్డుల మీద రికార్డులు నెలకొల్పుతున్నాడు అతను. ఇప్పటివరకూ వివిధ దేశాల్లో 60 గిన్నిస్ రికార్డులు సాధించాడు. ఆఖరికి తన వివాహ వేడుకను కూడా గిన్నిస్ రికార్డుల సాధనకు ఉపయోగించుకున్నాడు. 47 మంది తోడి పెళ్లికొడుకులను, 79 మంది తోడి పెళ్లికూతుళ్లను తన వివాహ వేడుకకు సిద్ధం చేసి రికార్డు సాధించాడు. అంతేకాదు... పెళ్లికూతురి చేతిలో ఉంచే పూలగుత్తి కోసం 197 అడుగుల పొడవైన పూలగుత్తిని తయారు చేయించి మరో గిన్నిస్ రికార్డు సృష్టించాడు. అయితే ఇలా గిన్నిస్ రికార్డులు బద్దలుకొట్టడం వెనుక ఆయనకు సదుద్దేశమే ఉంది. గిన్నిస్ రికార్డుల సాధన ద్వారా వచ్చిన ఆదాయాన్ని ప్రపంచవ్యాప్తంగా వీధిబాలల సంక్షేమానికి వినియోగిస్తాడట.

## రంగులు వేయండి



## మీకు తెలుసా..!

- స్టార్ ఫిష్ మహా గట్టిది. ఏదైనా ప్రమాదంలో దాని శరీరం మొత్తం పోయి ఒక చిన్న భాగమే మిగిలినా మళ్లీ పూర్తిగా ఎదుగుతుంది.
- హమ్మింగ్ బర్డ్ గుండె సగటున నిమిషానికి 1200 సార్లు కొట్టుకుంటుంది.
- నీలి తిమింగలం గుండె దాదాపు అంబాసిడర్ కారు సైజులో ఉంటుంది.
- న్యూజిలాండ్‌లో మనుషుల కంటే గొర్రెలే ఎక్కువ.



## చుక్కలు కలపండి



## ఆల్బరొబెల్లో

దక్షిణ ఇటలీలో దాదాపు పదకొండువేల మంది జనాభా కలిగిన ఓ చిన్న పట్టణం ఆల్బరబెల్లో. ఆల్బరబెల్లో అంటే 'అందమైన చెట్టు' అని అర్థం. దానికా పేరు ఎందుకు పెట్టారో తెలీదు గానీ ఈ పట్టణంలో ఇళ్లన్నీ... యూనిఫాం వేసుకుని నిలుచున్న బుద్ధిమంతులైన స్కూలు పిల్లల్లా కనిపిస్తాయి. పిరమిడ్ ఆకారంలోని ఈ ఇళ్లకు ట్రూలి అనే ప్రత్యేక పేరు కూడా ఉంది. ఈ ఇళ్లకు ఐదు శతాబ్దాల చరిత్ర ఉంది. 16వ శతాబ్దంలో ఆల్బరొబెల్లోలో నలభై కుటుంబాలు మాత్రమే నివసించేవి. వాళ్లంతా భూస్వామి అక్వవీవా దగ్గర పనిచేసే రైతులు. ఆ కుటుంబాలు ఆవాసాల కోసం స్థానికంగా దొరికే సున్నపురాళ్లనే వాడారు. తాత్కాలిక నివాసాలే అనే ఉద్దేశంతో వాళ్లు మోర్టార్‌ను ఉపయోగించలేదు. మోర్టార్ అంటే కాంక్రీటును కనిపెట్టని రోజుల్లో... రాళ్లను కలిపి ఉంచడానికి మట్టి, ఇసుకల మిశ్రమానికి నీటిని చేర్చి పేస్టులా చేసిన పదార్థం. పైగా మోర్టారును ఉపయోగించాలంటే దానికి ప్రత్యేకంగా పన్ను చెల్లించాల్సి ఉండేది. అసలే పేదలైన ఆ జనం ఆ పన్ను కట్టలేక, రాళ్లను శంకు ఆకారంలో పేర్చి ఇళ్లను కట్టుకుని అందులో ఉండేవారు. ఇవ్వాళ ఇంటి కప్పులపై కనిపించే వివిధ రకాల గుర్తులు ఇరవయ్యో శతాబ్దంలో వేసినవి. ఆ గుర్తులన్నీ క్రైస్తవ మత విశ్వాసాలకు సంబంధించిన గుర్తులు. ఇప్పుడు ఈ ఊరు ఒక పెద్ద పర్యాటక కేంద్రం.



## నా బొమ్మ



**ఎం.డి. అమీర్ ఆదిల్**
7వ తరగతి
చైతన్య టెక్నో స్కూల్
హనుమాన్ జంక్షన్
విజయవాడ

## దారి కనుక్కోండి






# మంచునీటి భగీరథులు

అందమైన కశ్మీర్‌లో మరింత అందమైన ప్రదేశం లడఖ్. పర్యాటకులను అమితంగా ఆకర్షించే అద్భుతమైన ప్రకృతి దృశ్యాలకు ఆ ప్రదేశం పెట్టింది పేరు. అందరికీ అంతగా నచ్చే లడఖ్... అక్కడి జనాభాకు మాత్రం కష్టాలసీమగా మారిపోయింది. అక్కడ 80 శాతం మందికి వ్యవసాయమే జీవనోపాధి. అయితే ఎముకలు కొరికే చలి, పంటలు పండని నేలలు వాళ్ల జీవితాలను దుర్భర స్థితిలోకి నెట్టేశాయి. గ్లోబల్ వార్మింగ్ కారణంగా లడఖ్ ఓ మంచు ఎడారిలా మారిపోయింది. అక్కడి వార్షిక వర్షపాతం 50 మిల్లీమీటర్ల కన్నా దిగువకు పడిపోయింది. ఆ కొద్దిపాటి వర్షం కురిసే సమయంలోనూ విపరీతమైన చలి ఉంటుంది. అది పంటలకు అనుకూలం కాదు. అందుకే వ్యవసాయానికి చాలామంది గ్లేసియర్స్ (హిమనదాలు) పైనే ఆధారపడేవారు. కానీ గ్లోబల్ వార్మింగ్ కారణంగా మునుపటిలా గ్లేసియర్స్ నుంచి పెద్దగా నీరు లభించడం లేదు.

అదృష్టవశాత్తూ లడఖ్‌లో ఇప్పుడు పరిస్థితి మారుతోంది. కృత్రిమ హిమనదాలు ఆ ప్రాంత ముఖ స్వరూపాన్ని మార్చడం మొదలైంది. దీనంతటికీ కారణమైన చెవాంగ్ నోఫెల్ ఇప్పుడక్కడ అందరికీ ఆరాధ్యనీయుడయ్యాడు. ఇదంతా ఎలా జరిగిందంటే- లడఖ్ జిల్లాలోని లే చెవాంగ్ సొంతూరు. అప్పటికీ ఇప్పటికీ తమ చుట్టుపక్కల గ్రామాలలో ఎలాంటి మార్పు చోటు చేసుకుందో చెప్తూ "నా బాల్యంలో మా ఇంటి దగ్గర నదిలో పుష్కలంగా నీళ్లు ఉండేవి. ప్రవాహం వేగంగా ఉంటుందని మా అమ్మవాళ్లు నన్ను ఆవలివైపుకి కూడా పోనిచ్చేవాళ్లు కాదు. కానీ కాలక్రమంలో గ్లోబల్ వార్మింగ్ కారణంగా అది ఎండిపోయింది. నీటి ఎద్దడిని తీర్చే హిమనదాలు సైతం కనుమరుగై పోయాయి" అన్నారు. చెవాంగ్ రిటైర్డ్ సివిల్ ఇంజనీర్. తన ఇంజనీరింగ్ పరిజ్ఞానం ఈ నీటి ఎద్దడి పరిష్కారానికి ఉపయోగపడితే బాగుండునని అనుకునేవారు. ఒకరోజు తన ఇంటి దగ్గరలోని కుళాయి నుంచి నీరు లీకై నేలపై మడుగులా గడ్డ కట్టడం గమనించారు చెవాంగ్. ఆ దృశ్యం అతనిలో కొత్త ఆలోచనకు మొగ్గ తొడిగింది. వర్షాకాలంలో కురిసే వాన నీటిని స్టోర్ చేస్తే అది చలికాలంలో గడ్డకడుతుంది. వేసవిలో ఆ మంచు కరిగినప్పుడు దాన్ని వ్యవసాయానికి ఉపయోగించుకోవచ్చు కదా అనుకుని వెంటనే కృత్రిమ గ్లేసియర్స్‌కు అంకురార్పణ చేశారు చెవాంగ్. కొండలపై ఎక్కువ ఎండ తగలని ప్రాంతంలో నీటితొట్టెల్లాంటి నిర్మాణాల్లోకి వర్షపు నీటిని మళ్లించారు. అది చూసి ప్రారంభంలో అందరూ నవ్వారట. కానీ ఫలితాలు వస్తున్నకొద్దీ వారిలో ఉత్సాహం వచ్చింది. ఒంటరిగా మొదలైన పయనం స్థానికుల సాయంతో పదిహేను కృత్రిమ గ్లేసియర్స్‌ని సృష్టించే వరకూ వెళ్లింది. ప్రజలంతా చెవాంగ్‌ని 'ఐస్‌మ్యాన్' అని పిలవడం మొదలుపెట్టారు. ప్రభుత్వం కూడా ఆయన కృషిని గమనించి 2015లో పద్మశ్రీ పురస్కారంతో సత్కరించింది.

లడఖ్ జిల్లాలోని మారుమూల గ్రామాల వారి నీటి ఎద్దడిని తీర్చడంలో చెవాంగ్ సాధించిన విజయం సోనమ్ వాంగ్‌చుక్‌కి ప్రేరణగా నిలిచింది. చెవాంగ్ మొదలుపెట్టిన కృత్రిమ గ్లేసియర్స్‌కి తన సృజనాత్మకతను జోడించి 'ఐస్‌స్థూపాలు'కు ఆద్యుడయ్యాడు వాంగ్‌చుక్. నిజానికి వాంగ్‌చుక్ సామాన్యుడు కాదు. అతడు సాధించిన అనేక విజయాల్లో 'ఐస్‌స్థూపాలు' ఒకానొకటి. ఇంజనీర్‌గా, ఆవిష్కర్తగా, విద్యా సంస్కరణవేత్తగా వాంగ్‌చుక్‌కు ఎంతో పేరుంది. హిందీ సినిమా 'త్రీ ఇడియట్స్'లో అమీర్‌ఖాన్ పోషించిన 'ఫున్‌సుఖ్ వాంగ్డు' పాత్రకు ప్రేరణగా నిలిచిన వ్యక్తి మరెవరో కాదు ఇతడే!

చెవాంగ్ కృత్రిమ గ్లేసియర్స్‌ని నీటి మడుగుల్లా సృష్టిస్తే... వాంగ్‌చుక్ ఎక్కువకాలం ఉండేలా, ఎక్కువమందికి పనికి వచ్చేలా వాటిని భూమికి నిట్టనిలువుగా స్థూపాల్లా నిలబెట్టాడు. ఒక్కొక్క స్థూపంలోనూ 16 వేల క్యూబిక్ లీటర్ల నీటిని నిలువ చేయవచ్చు. ఈ నీటితో 10 హెక్టార్ల నేలలో వ్యవసాయం చేయొచ్చు. చెవాంగ్ కృత్రిమ గ్లేసియర్స్‌ని చాలా ఎత్తులో నెలకొల్పడం వల్ల వాటికోసం గ్రామస్తులు కొండలెక్కాల్సి వచ్చేది. వాంగ్‌చుక్ వాటిని గ్రామాల్లోనే నెలకొల్పితే ఎక్కువ ప్రయోజనం కదా అని ఆలోచించి ఆ దిశగా ప్రయోగాలు చేసి ఐస్‌స్థూపాలను ఆవిష్కరించాడు. ఇదెలా సాధ్యమైందో చెబుతూ వాంగ్‌చుక్ -

"నేను గమనించినంత వరకూ వసంతకాలపు ఎండ, గాలి మంచుని నెమ్మదిగా కరిగిస్తాయి. కృత్రిమ గ్లేసియర్స్ బల్లపరుపుగా ఉండడం వల్ల ఎండ పడే ప్రాంతం ఎక్కువ కాబట్టి కరిగిపోయే వేగం ఎక్కువ. అలా కాకుండా లడఖ్ సంప్రదాయ స్థూపాల్లా... గ్లేసియర్స్‌ని ఏర్పాటు చేస్తే వాటిపై ఎండ పడే ప్రాంతం తక్కువ కాబట్టి అవి నెమ్మదిగా కరుగుతాయి. ఈ పద్ధతిలో గ్రామాల్లోనే కృత్రిమ గ్లేసియర్స్‌ని ఏర్పాటు చేయడం మంచిదని భావించాను. ఈ ఏర్పాటు గ్రామస్తులకు కొండలెక్కే బాధను తప్పించింది" అన్నారు.




లడఖ్ జిల్లాలోని కొన్ని గ్రామాల్లో నీటి కొరత మళ్లీ తలెత్తకుండా ఇలాంటి స్థూపాలను దాదాపు 90 వరకూ ఏర్పరచాలనేది వాంగ్‌చుక్ లక్ష్యం. ఈ స్థూపాల నిర్మాణా నికి గాను దాదాపు 70-75 లక్షలు ఖర్చవుతుందట. ఈ మొత్తాన్ని విరాళాల రూపంలో సేకరించడానికి ప్రయత్నాలు ప్రారంభించారు వాంగ్‌చుక్. ■




## విమానాల్లో ఆహారం రుచిగా ఉండదు..?



విమానాల్లో వడ్డించే ఆహారం అంత రుచిగా అనిపించదు. వెజ్, నాన్‌వెజ్ అనే తేడా లేదు. ఏ ఆహారమైనా రుచిపచి లేకుండా ఉంటుంది. ఇది విమాన ప్రయాణం చేసిన ప్రతివాళ్లకూ ఏదో ఒక సమయంలో కలిగే అనుభవమే. కానీ ఫ్లైట్‌లో సర్వ్ చేసే ఆహారాన్ని రెస్టారెంట్‌లో పరీక్షించాకే సప్లై చేస్తారు. మరి రెస్టారెంటులో రుచిగా ఘుమఘుమలాడే ఆహారం... ఫ్లైట్‌లోకి రాగానే ఎందుకు చప్పబడిపోతుంది. సమస్య ఆహారంలో కాదు... తినే వాళ్లలోనే ఉందంటే నమ్ముతారా ఎవరైనా? కానీ అదే నిజం. జర్మనీకి చెందిన ఫ్రాన్‌హోఫర్ అనే సంస్థ ఈ విషయంపై పరిశోధన చేసి భూమికి 35 వేల అడుగుల ఎత్తులో ప్రయాణిస్తున్నప్పుడు అక్కడి పొడిగాలిలోని చల్లదనం, ఒత్తిడి నాలుకపై రుచి మొగ్గలను మొద్దుబారిపోయేలా చేస్తాయని చెప్పింది. ఆ స్థితి ఎలా ఉంటుందంటే అచ్చం జలుబు చేసినప్పుడు ఏ విధంగా రుచిమొగ్గలు పనిచేయడం మానేస్తాయో అలా. దానివల్ల మన రుచి సామర్థ్యం ఇరవై నుంచి యాభై శాతం తగ్గుతుంది. ముఖ్యంగా తీపి, ఉప్పు రుచులను తెలుసుకునే శక్తి ముప్పైశాతం తగ్గిపోతుంది. అలాగే మన ముక్కు పొడిబారిపోయి ఘ్రాణశక్తి కూడా తగ్గిపోతుంది. ఒక్కోసారి వాసన, రుచి రెండిటి సామర్థ్యమూ యాభై శాతం వరకూ తగ్గిపోయే అవకాశాలూ ఉన్నాయట!

## ఆర్కిటిక్‌లో చేపలు గడ్డకట్టవు...?



శీతాకాలంలో ఆర్కిటిక్ ఉపరితలమంతా మంచుతో గడ్డకట్టినా అడుగున మాత్రం నీరు ప్రవహిస్తూ ఉంటుంది. ఆ నీటిలోని చేపలు చలికి బిగుసుకుపోకుండా మామూలుగానే జీవిస్తుంటాయి. కారణం అవి శీతలరక్త జీవులు. బయటి వాతావరణానికి అనుగుణంగా తమ శరీర ఉష్ణోగ్రతను అవి నియంత్రించుకోగలవు. అంతేగాక వాటి రక్తంలో శీతలీకరణకు వ్యతిరేకంగా పనిచేసే పదార్థముంటుంది. స్నల్ఫిన్ అనే ఆర్కిటిక్ ఫిష్ అయితే స్వయంగా యాంటీ ఫ్రీజింగ్ ప్రొటీన్‌ను తయారు చేసుకుంటుంది. ఈ ప్రొటీన్ ప్లాస్మాను (ప్లాస్మా అంటే రక్త జీవ ద్రవం. ఇది రక్తంలో 55 శాతం ఉంటుంది) చలికి గడ్డకట్టకుండా చేయగలుగుతుంది.

## వీలు చూసుకోండి!

"ఆండాలూ .. నీకు పండక్కి చీర కొనమంటావా? చుడీదార్ కొనమంటావా?" ప్రేమగా అడిగాడు భర్త సుబ్బారావు.

"ఏది కొన్నా నాకు ఓకే. ఉతకడానికి మీకు ఏది అనుకూలమో చూసి కొనండి" బదులిచ్చింది ఆండాలు.

## మిక్చర్ పొట్లం

బొమ్మలు : **చారి పి.యస్.**

### నిజం తెలుసుకో శిష్యా!



"స్వామీ రాత్రుళ్లు మా ఆవిడ ముఖం నుండి తెల్లటి కాంతి వస్తోంది. దుప్పటి కప్పుకున్నా సరే .. కాంతి వలయం కనిపిస్తోంది. తనకేమైనా మహిమలు ఉన్నాయంటారా?" కంగారుగా అడిగాడు బుచ్చిబాబు.

"నాయనా .. రాత్రి పడుకోబోయే ముందు నీ సెల్‌ఫోన్ లాక్ చేసి పడుకో. నీకు తెలియకుండా నీ భార్య నీ చాటింగులన్నీ దుప్పటి కప్పుకుని మరీ చదువుతోంది. సెల్ ఫోన్ కాంతి నాయనా అది" చెప్పాడు సచ్చిదానందస్వామి.

### అడుగు జాడల్లో

క్లాసులోని పిల్లలంతా ఒక్కొక్కరుగా నిల్చుని భవిష్యత్తులో తాము ఏం కావాలనుకుంటున్నారో చెబుతున్నారు.

"నేను మా నాన్నలా కలెక్టర్ కావాలని అనుకుంటున్నా ..." చెప్పాడు హరిబాబు.

"మీ నాన్న కలెక్టరా?" ఆశ్చర్యపోయాడు టీచర్.

"కాదు. ఆయన కూడా కలెక్టర్ కావాలని అనుకున్నారట" చెప్పాడు హరిబాబు.

### మా అవసరం లేదు నాయనా!




"స్వాములంతా ఒకేసారి బయల్దేరారు ఎక్కడికో?" అడిగాడు అంబాజీరావు.

"అందరం కలిసి సజీవ సమాధి అవుదామని వెళ్తున్నాం .." బాధగా బదులిచ్చాడు ఒక స్వామి.

"సర్వసంగ పరిత్యాగులు .. మీకే అంత నిరాశా నిస్పృహలా?" ఆశ్చర్యపోయాడు అంబాజీరావు.

"ఏం చెయ్యమంటావు నాయనా .. ఈ ఫేస్‌బుక్కులూ, వాట్సప్‌లూ వచ్చాక ప్రతి ఒక్కడూ జ్ఞానబోధ చేస్తున్నాడు. మా అవసరం లేకుండా పోయింది" కళ్లు తుడుచుకున్నాడు మరో స్వామి.

## సమయస్ఫూర్తి



"దొంగా .. దొంగా అని అరచినా ఒక్కడూ బయటకి రాలేదన్నావు. మరి దొంగనెలా పట్టిచ్చావు?" అడిగాడు సోమశేఖరం.

"ఎవరూ రాకపోయేసరికి తమన్నా .. తమన్నా .. అని అరిచా .. వెంటనే తలుపులు తెరుచుకుని వచ్చేశారు. వెంటనే దొంగను పట్టిచ్చా .." చెప్పాడు రాజశేఖరం.

## కొత్త విద్యార్థి

"నిన్న నేను చెప్పిన పాఠం అప్పగించు" అడిగాడు టీచర్.

"తుమ్ సోజా మా .. మై జ్యోతీకే ఘర్ జావుంగా .." చెప్పాడు కొత్తగా చేరిన విద్యార్థి చమన్‌లాల్.

"అడ్డ గాడిదా, 'తమ సోమా జ్యోతిర్గమయా' అని చెప్పాలి .." అరిచాడు టీచర్.

## నోటు పెట్టి నోట్లు తెచ్చా




"ఎక్కడా చిల్లర దొరకడం లేదు కదరా! నీ దగ్గర ఇన్ని వంద నోట్లు ఎక్కడివిరా?" ఆశ్చర్యంగా అడిగాడు చినబాబు.

"రెండు వేల నోటుని సేట్ చమన్‌లాల్ దగ్గర తాకట్టు పెట్టి వడ్డీ మీద పది వంద నోట్లు తెచ్చా.." చెప్పాడు పెదబాబు.

## బస్సెక్కితే 12 లోపే!

"12 ఏళ్ల లోపున్నవారికే హాఫ్ టికెట్ .." అని అరుస్తూ పక్కనే ఉన్న బుజ్జిని అడిగాడు కండక్టర్.

"నీ వయస్సెంత బాబూ?"

"పదకొండు".

"12 ఎప్పుడొస్తాయి?" కండక్టర్.

"బస్సు దిగిన తర్వాత" బుజ్జి.

## ఛాయా'చిత్రం'



"డాక్టర్‌గారూ .. కళ్లు కనిపించడం లేదండీ"
"జబ్బేం లేదు. ఒకసారి హెయిర్ కటింగ్ చేయించుకో... సరిపోతుంది".

# దిగులు గుర్రం!

ఈ వారం కవిత



బొమ్మ : **అక్బర్**

యుద్ధంలో ఓడిపోయిన
వీరుడి గుర్రమైనా ఇంత దిగులుగా కనిపించదు;

ఈ తైలవర్ణ చిత్రంలో
మూడు ప్రతిరూపాలతో వున్న గుర్రం ఒకటి
తన సహజసిద్ధ చైతన్యాన్నీ
తన బాణవేగ చలనాన్నీ
తన బలిష్ట ఆత్మవిశ్వాసాన్నీ మరిచి
ఒంటరిగా
ఒక ఏకాంతపు చీకటిగుహలో
తలనేలకి వాల్చి
గాలికి కూడా చలించని జూలులో
గాయమేదో దాగి వున్నట్టు
తను పోరిన రణరంగాలేవో
తలపులలో దుమ్మురేపుతున్నట్టు;

అలెగ్జాండర్ గుర్రమో
పురుషోత్తముడి గుర్రమో
చెంఘిజ్‌ఖాన్ గుర్రమో
అశోకుడి గుర్రమో అక్బర్ గుర్రమో
శాతకర్ణి గుర్రమో సముద్రగుప్తుడి గుర్రమో
రుద్రమదేవి గుర్రమో కృష్ణదేవరాయల గుర్రమో
ఎవరి సామ్రాజ్యవిస్తరణకోసం
ఎన్ని ఎడారులూ అరణ్యాలూ సముద్రాలూ
దాటి నాలుగు కాళ్లమీద
దౌడుతీసిన మెరికలాంటి
మేలుజాతి గుర్రమో
ఎన్ని ఆధిపత్యాలను నేలకూల్చిన గుర్రమో
ఎన్ని నవనాగరికతలను మోసుకువెళ్లిన గుర్రమో
ఇప్పుడు ఇలా కుంచెనుంచి ఎగిరి
నా గదిగోడమీద రంగులబొమ్మగా మారి
గూడుకట్టిన దిగులులా
ఈ అలిసిసొలిసిన ఆత్మ గుర్రం!!

**- దేవీప్రియ**

(ప్రముఖ చిత్రకారుడు, స్నేహితుడు భరత్‌భూషణ్ 2012లో నాకు బహూకరించిన, ఇప్పటి నా దిగులుకి ప్రతిరూపంగా కనిపిస్తున్న ఒక పెయింటింగ్‌ని నిత్యం చూస్తూ ...)

# అనుగ్రహం

22-28 జనవరి 2017

డాక్టర్ పి.ఎ.రామన్



**మేషం : అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

శ్రమాధిక్యత మినహా ఫలితం ఉండదు. ఆశయ సాధనకు మరింతగా శ్రమించాలి. ఇతరులపై ఆధార పడవద్దు. స్వయంకృషితోనే అనుకున్నది సాధిస్తారు. రావలసిన ధనం ఆలస్యంగా అందుతుంది. ఆది, సోమ వారాల్లో చెల్లింపులు, నగదు స్వీకరణలో జాగ్రత్త. పనులు ప్రారంభంలో చికాకులెదుర్కుంటారు. శకునాల ప్రభావం అధికం, కొన్ని విషయాలు పెద్దగా పట్టించుకోవద్దు. వ్యవహారాల్లో ప్రతికూలతలుంటాయి. మీ అభిప్రాయాలకు ఏమంత స్పందన ఉండదు. మీ శ్రీమతి సలహా పాటించండి.



**వృషభం : కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

కృషి ఫలించకున్నా యత్నించామన్న తృప్తి ఉంటుంది. బంధువుల వ్యాఖ్యలకు దీటుగా స్పందిస్తారు. అవకాశాలను తక్షణం వినియోగించుకోండి. రోజువారీ ఖర్చులే ఉంటాయి. పనులన్నీ అనుకున్న విధంగా పూర్తి కాగలవు. వ్యవహారాలు మీ చేతుల మీదుగా సాగుతాయి. ఆత్మీయులకు చక్కని సలహాలిస్తారు. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. పరిచయాలు ఉన్నతికి దోహదపడతాయి. మంగళ, బుధ వారాల్లో పరిచయం లేని వారితో జాగ్రత్త. ఎవరినీ అతిగా విశ్వసించవద్దు.



**మిథునం : మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

పదవులు, బాధ్యతల నుంచి తప్పుకుంటారు. ఆలోచనలు పలు విధాలుగా ఉంటాయి. కొత్త యత్నాలు ప్రారంభిస్తారు. ఖర్చులు అధికం, విలువైన వస్తువులు, వాహనం అమర్చుకుంటారు. పనులు సకాలంలో పూర్తి కాగలవు. ఆది, గురు వారాల్లో అయిన వారితో స్పర్థలు తలెత్తుతాయి. పెద్దల జోక్యం అనివార్యమవుతుంది. గుట్టుగా యత్నాలు సాగించండి. ఇతరుల విషయాల్లో జోక్యం తగదు. మీ శ్రీమతి వైఖరిలో మార్పు సంభవం.



**కర్కాటకం : పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

కొన్ని విషయాలు ఊహించినట్టే జరుగుతాయి. అధైర్యపడాల్సిందేమీ లేదు. సమస్యలు క్రమంగా సర్దుకుంటాయి. ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. అవసరాలకు ధనం అందుతుంది. సకాలంలో చెల్లింపుల జరుపుతారు. మంగళ, శని వారాల్లో పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి. మీపై శకునాల ప్రభావం అధికం. సంతానం కదలికలపై దృష్టి సారించండి. దంపతుల మధ్య ఏకాభిప్రాయం నెలకొంటుంది.



**సింహం : మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

నిర్దిష్ట ప్రణాళికలతో యత్నాలు ప్రారంభిస్తారు. అవసరాలు, కోరికలు నెరవేరుతాయి. కలిసివచ్చిన అవకాశాన్ని తక్షణం వినియోగించుకోండి. ఎవరినీ సలహా అడుగవద్దు. కిట్టని వారు తప్పుదారి పట్టించేందుకు యత్నిస్తారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. అయినవారితో సంప్రదింపులు జరుపుతారు. మొహమ్మాటాలు, ఒత్తిళ్లకు లొంగవద్దు. గురు, శుక్ర వారాల్లో ఆందోళన కలిగించే సంఘటనలెదురవుతాయి. ప్రముఖుల సాయంతో ఒక సమస్య సానుకూలమవుతుంది.



**కన్య : ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

కష్టం మీకు, ప్రతిఫలం మరొకరికి అన్నట్టుగా ఉంటుంది. ఏది జరిగినా మంచికేనని భావించండి. మీ సమర్థతకు ఆలస్యంగా గుర్తింపు లభిస్తుంది. శుభ కార్యానికి యత్నాలు సాగిస్తారు. ఒక సమాచారం ఉత్సాహాన్నిస్తుంది. శనివారం నాడు పనుల సానుకూలతకు మరింతగా శ్రమించాలి. పరిచయాలు ఉన్నతికి దోహదపడతాయి. విలువైన వస్తువులు, పత్రాలు జాగ్రత్త. వ్యవహారాల్లో మొహమాటాలకు పోయి ఇబ్బందులెదుర్కుంటారు. కొన్ని సంఘటనలు పునరావృతమయ్యే సూచనలున్నాయి.



**తుల : చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

ఈ వారం ఆకస్మిక ఖర్చులుంటాయి, ధనం మితంగా వ్యయం చేయండి. సన్నిహితులే సాయం చేసేందుకు వెనుకాడుతారు. రుణదాతల ఒత్తిడి పెరుగుతుంది. బాధ్యతగా వ్యవహరించండి. వాగ్వాదాలు, పంతాలకు పోవద్దు. ఆప్తులను కలుసుకుంటారు. ఒక ఆహ్వానం ఆలోచింపచేస్తుంది. పనుల్లో జాప్యం, ఒత్తిడి అధికం. ఆరోగ్యం స్థిరంగా ఉంటుంది. పెద్దలతో సంప్రదింపులు జరుపుతారు. మీ శ్రీమతి సలహా పాటించండి. కొత్త యత్నాలు ప్రారంభిస్తారు. ఆస్తి వివాదాలు కొలిక్కి వస్తాయి.



**వృశ్చికం : విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

గృహంలో సందడి నెలకొంటుంది. బంధుత్వాలు, పరిచయాలు బలపడతాయి. మీ మాటకు స్పందన లభిస్తుంది. ఖర్చులు భారమనిపించవు. అయినవారి కోసం బాగా వ్యయం చేస్తారు. అసాధ్యమనుకున్న పనులు తేలికగా పూర్తవుతాయి. బాధ్యతలు అప్పగించవద్దు. అవగాహన లేని విషయాలకు దూరంగా ఉండాలి. గుట్టుగా యత్నాలు సాగించండి. మీ నుంచి విషయ సేకరణకు కొంతమంది యత్నిస్తారు. మితంగా సంభాషించండి. కొన్ని విషయాలు పట్టించుకోవద్దు.



**ధనుస్సు : మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

సమర్థతకు గుర్తింపు అవకాశాలు కలిసి వస్తాయి. పదవులు స్వీకరిస్తారు. కొత్త పరిచయాలేర్పడతాయి. ప్రశంసలు, సత్కారాలు అందుకుంటారు. ప్రత్యర్థులతో జాగ్రత్త. ఎవరినీ తక్కువ అంచనా వేయొద్దు. ఎదుటివారి తీరును గమనించి మెలగండి. ఖర్చులు విపరీతం. విలాసాలకు బాగా వ్యయం చేస్తారు. నోటీసులు, కీలక పత్రాలు అందుకుంటారు. దంపతుల మధ్య అన్యోన్యత నెలకొంటుంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించండి.



**మకరం : ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

పట్టుదలతో శ్రమించి అనుకున్నది సాధిస్తారు. విమర్శించిన వారే మీ సమర్థతను గుర్తిస్తారు. ఊహించిన ఖర్చులే ఉంటాయి. ధనానికి ఇబ్బంది ఉండదు. రుణ విముక్తులవుతారు. ప్రభుత్వ కార్యాలయాల్లో పనులు సానుకూలమవుతాయి. వ్యవహార ఒప్పందాలకు అనుకూలం. మీ ప్రతిపాదనలకు ఆమోదం లభిస్తుంది. మంగళ, బుధ వారాల్లో ఇతరుల విషయాల్లో జోక్యం తగదు. సంతానం ద్వారా శుభవార్తలు వింటారు.



**కుంభం : ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

ఆర్థిక ఇబ్బంది లేకున్నా సంతృప్తి ఉండదు. తెలియని అసంతృప్తి వెన్నాడుతుంది. పరిచయస్తులు ధనసహాయం అర్థిస్తారు. పెద్దమొత్తం సహాయం క్షేమం కాదు. మీ ఇష్టాయిష్టాలను సున్నితంగా తెలియజేయండి. గురు, శుక్ర వారాల్లో పనులు సాగక విసుగు చెందుతారు. ప్రముఖుల ఇంటర్వ్యూ కోసం పడిగాపులు తప్పవు. కుటుంబ విషయాలను పట్టించుకోండి. మీ శ్రీమతి వైఖరిలో ఆశించిన మార్పు వస్తుంది. విలువైన వస్తువులు, వాహనం జాగ్రత్త. వ్యాపారాలు సామాన్యంగా సాగుతాయి.



**మీనం : పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

ఎదుటివారి ఆంతర్యం గ్రహించండి. పంతాలు, పట్టుదలలకు పోవద్దు. లౌక్యంగా పనులు చక్కబెట్టుకోవాలి. ఆదాయ వ్యయాలు పర్వాలేదనిపిస్తాయి. ఖర్చులు పెరిగినా వెసులుబాటు ఉంటుంది. ఆప్తులకు సాయం అందిస్తారు. శనివారం నాడు ఒక సమాచారం తీవ్రంగా ఆలోచింపచేస్తుంది. అయినవారితో సంప్రదింపులు జరుపుతారు. ప్రతి విషయంలోను ఆచితూచి వ్యవహరించాలి. స్వల్ప అస్వస్థతకు గురవుతారు. వైద్యసేవలు అవసరమవుతాయి. కొత్త యత్నాలకు శ్రీకారం చుడతారు.

అవునా!



పదిహేను మైళ్ల అడుగు నుంచి కూడా డాల్ఫిన్లు... నీటి ఉపరితలంపై శబ్దాలను వినగలవు.

- ఒక బాల్ పాయింట్ పెన్ను పట్టే రంధ్రంలోంచి సైతం చుంచెలుక వెళ్లిపోగలదు.

- ఏడేళ్లకు ఒకసారి మన శరీరంలోని ప్రతి అణువూ నశించిపోయి కొత్త అణువు పుడుతుంది. అంటే ఏడేళ్ల కిందట ఉన్న మనం... మనం కాదన్నమాట.



మానవ మస్తిష్కం ఒక కంప్యూటర్ అనుకుంటే అది సెకనుకు దాదాపు ముప్పై ఎనిమిది వేల లక్షల కోట్ల ఆపరేషన్స్ నిర్వహించగలదు.

- ప్రయరీడాగ్స్ ఒకదాన్నొకటి ముద్దు పెట్టుకోవడం ద్వారా హలో చెప్పుకుంటాయి.

- మనుషుల శరీరంపై నివాసముండే బ్యాక్టీరియా బరువు తొమ్మిది వందల గ్రాముల నుంచి నాలుగు కేజీల వరకూ ఉంటుందట.




నెప్ట్యూన్ అనే గ్రహం ఉన్నట్టు టెలిస్కోపులో చూడకముందే... అంతరిక్ష గణన ద్వారా దాని ఉనికిని ఊహించారు.

- 160 ఏళ్ల క్రితం ఐర్లాండ్‌లో సంభవించిన బంగాళాదుంప సంక్షోభంలో చాలామంది చనిపోయారు. ఇప్పటికీ ఐర్లాండ్ జనాభా ఆ సంక్షోభం ముందుకన్నా రెండు మిలియన్లు తక్కువగానే ఉంది.

# అదృష్ట రత్నజ్యోతి


## రమేశ్చంద్ర మహర్షి

సెల్ : 92465 82255, ఫోన్ : 040-6522 5554


**పి.ఎస్., వనపర్తి**

**మా అమ్మాయి జన్మకుండలి నిర్మొహమాటంగా వివరించగలరు.**

ఈ జన్మకుండలి ప్రకారం- నక్షత్రం పుష్యమి. కర్కాటక రాశి.

**యోగాలు :** 1. రుచక మహా పురుష యోగం. 90 శాతం పని చేస్తుంది. గొప్ప గృహయోగానికీ, వృత్తిలో యోగం ఇవ్వడానికీ, గొప్ప ధన యోగానికీ ఈ యోగం పనిచేస్తుంది.

2. రాజయోగం. వృత్తికీ, వైవాహిక జీవితానికీ, సంతానం వృద్ధిలోకి రావడానికీ ఈ రాజయోగం పని చేస్తుంది.

వైవాహిక జీవితం ఎలా ఉన్నా, చూడ్డానికి మాత్రం ఘనంగా ఉండేలా చేయడం ఈ యోగం చేసే పని.

3. పరివర్తన యోగం. అష్టమ దశమాధిపతుల మధ్య పరివర్తన. ఈ జాతకురాలి వృత్తికి రాజ యోగం ఎంత బలంగా పని చేస్తుందో, ఎంత ఉన్నత స్థితిలో ఉంచుతుందో... ఈ పరివర్తన యోగం వలన వృత్తిలో అన్ని ఆటంకాలూ, లిటి గేషన్లూ, పిటిషన్లూ అన్న ట్టుగా ఉంటుంది. ఈ యోగా నికి గట్టి రెమిడీస్ పాటించాలి. వాటిలో ఒకటి, ఈ జన్మకుండలిని చంద్రలగ్నాత్తూ పనిచేసేలా చేసు కోవడం, స్వక్షేత్రంలో ఉన్నాడు కాబట్టి సాధ్యమే!



**విద్య :** ఇంజినీరింగ్ పైన చెప్పు కున్న రాజయోగం, మహాపురుష యోగం ఇవి విద్యకు కూడా పని చేసేవి కావడం వలన విద్యలో ఎలాంటి ఆటంకాలుండవు. పి.జి. కూడా ఉంటుంది.

**వృత్తి :** నూటికి నూరు శాతం ఇంజినీర్. మొదట ప్రభుత్వోద్యోగం అనుకున్నా, రవి వలన ఆ ఆలోచన క్రమంగా మారిపోతుంది. ప్రైవేట్ సెక్టరయినా ఉద్యోగంలో ఉన్నతి అసాధారణం. శుక్రుని అనుగ్రహం పొందగలిగితే మాత్రం పైన చెప్పుకున్న ఆటంకాలను సునా యాసంగా అధిగమించవచ్చు.

23వ ఏట... అంటే కేతువులో గురు భుక్తిలో ఒక ఉద్యోగం. 24వ ఏట అంటే కేతువులో శని భుక్తిలో మరో ఉద్యోగం. రెండూ మంచివే అయినా రెండవది ఖాయమవుతుంది.

**వివాహం :** కేతువులో గురువూ, శని ఇద్దరూ వివాహాన్నివ్వాలని ప్రయత్నిస్తారు. అది రవి ద్వారా. అయితే ఇక్కడ శని అధిపతి కూడా. అలాగే ఎంతో కొంత లేట్ మ్యారేజ్. అయితే గురునికి రెండో కంట్రోలింగ్ ఫేక్టర్ షష్ఠమంలో పడిన కేతువు. అలా ఏవిధంగా చూసుకున్నా కేతువులో శనిలోనే వివాహం జరుగుతుంది.

కేతు దశ అయిపోయేవరకూ భార్యాభర్తల మధ్య పెద్దగా అన్యోన్యత చోటు చేసుకోదు. అలాగే వ్యయంలో రాహు చంద్రుల స్థితీ, అష్టమంలో శుక్రుని స్థితీ వెరసి 'మూడో వ్యక్తి' వలన కాపురంలో సవ్యత, సఖ్యత లేకుండా అయి పోయే ప్రమాదం ఉంటుంది. ఇది అమ్మాయి వైపు నుండే అని గమ నించేది. సప్తమంలో బుధుని స్థితి కూడదు. అలాగే రవి. అంటే రవి బుధ రాహు చంద్ర శుక్రులు- ఇంతమంది వీళ్ళ సంసా రానికి వ్యతిరేకంగా పనిచేసే పరిస్థితి ఉంది. ఏదేమైనా శుక్రునిలో చంద్ర భుక్తి... అంటే 31వ సంవత్సరం, శుక్రునిలో రాహు భుక్తి... అంటే 33 నుండి 36వ సంవత్సరం మధ్య వైవాహిక బంధం ఎప్పుడు తెగి పోతుందా, ఎప్పుడు విషయం కోర్టుకెక్కుతుందా అన్నట్టుగా ఉంటుంది. ఆయా రెమిడీస్ పాటించాలి.

**స్థిరచరాస్తులు :** రుచక మహా యోగం వలన మంచి గృహ యోగం. శని కుజుల పరస్పర వీక్షణ వలన స్థిరాస్తులు విపరీ తంగా ఏర్పడతాయి. బృహస్పతి అనుకూలత వలన అవి నిలబడ తాయి. జీవితకాలం మొత్తంలో ఏర్పడే గృహాల సంఖ్య నాలుగు. వాటిలో రెండు స్థిరంగా ఉంటాయి. మిగిలిన రెండూ అమరడం, అమ్ము డుపోయి సొమ్ముగా మారడం ఒక చక్రంలా మారుతుంది. స్థిరంగా ఉండే గృహాలు ఏర్పడే సమయాలు- 1. 32వ ఏట 2. 47వ ఏట.

వాహన యోగం బాగుంటుంది కానీ ప్రమాదాలు కాకుండా ఉండా లంటే రాహుశుక్రులకు రెమిడీస్ పాటించాలి.

**అదృష్ట రత్నాలు :** పుష్యరాగం + పగడం.

# దాహం



బొమ్మలు : **చారి పి.యస్.**

**మందుల వాసన కొడుతున్న రూమ్‌లో నుండి బయటకి అడుగు పెట్టగానే ... ఏరు ముందా ఏకాశి ముందా అన్నట్టు ఎత్తిపోస్తున్న గాలి కూడా ఆహ్లాదంగానే అనిపించింది. అద్దాల కిటికీలో నుండి బయటకి చూస్తే పచ్చటి తురకేపాకు చెట్ల మధ్యనుండి మబ్బులు పింజెలు పింజెలుగా తేలిపోతూ కనిపించాయి. పది గదుల పొడవున్న పరిశుభ్రమైన కారిడార్ అది. గదుల్లో ఉన్న మనుషుల ఆలోచనల్లో కడలిని మించి అలజడి. ఎవరో రహస్య శత్రువు మనసుకి గుబులు మేఘం తొడిగినట్లుంది. ఉష్.. నిశ్శబ్దం అనే హెచ్చరికల మధ్య ఏవో పొడి పొడి మాటలు తప్ప దుఃఖంతో పూడిపోయిన గొంతులు పెగలడం లేదు.**

నర్స్ స్టేషన్ దగ్గరకి వచ్చి నిలబడ్డాను. పేషంట్ల ఫైల్స్ చెక్ చేస్తున్న పిఆర్‌ఓ లక్ష్మి నేను పలకరించకుండానే "డాక్టర్ గారు వచ్చేస్తున్నారు. జస్ట్ ... పది నిమిషాలు వెయిట్ చేయండి చాలు" అంది. అదే మాట అప్పటికనేకసార్లు ఎంతో మంది చెప్పడంతో ...

"నిన్ననగా అడ్మిట్ చేసాము. ఇంతవరకు డాక్టర్ రాకపోతే ఎలా? మీరేమో కీమోథెరపీ స్టార్ట్ చేద్దామంటారు. శ్వాస సరిగా అందక ఆయన ఇబ్బంది పడుతున్నారు. ముందు దానికి ట్రీట్మెంట్ ఇస్తామని చెప్పారు కదండీ" అన్నాను విసుగ్గా.

**ఈ వారం కథ**

**వనజ తాతినేని**

"ఆ సంగతి చెప్పడానికే డాక్టర్‌గారు వస్తున్నారు కొంచెం ఓపిక పట్టండి, ప్లీజ్!"

వీళ్ళ జో కొట్టే మాటలు వింటూ కూర్చోవడం కన్నా నేరుగా వెళ్ళి డాక్టర్‌తో మాట్లాడటమే నయమనుకుని మెట్లు దిగుతున్నా. ఎదురుగా ఒకామె ఆదరాబాదరాగా మెట్లెక్కుతూ "రెండు వందల పదకొండో నంబర్ రూమ్ ఎటువైపమ్మా" అని అడిగింది.

"ఇదిగో ఇలా వెళ్ళి కుడి వైపుకి తిరగండి, చిట్టచివరి రూమే అది" అని చెప్పి వెళ్లబోతుండగా వెనుకనుంచి అమ్మాయ్ ... మీది అమరావతి దగ్గరి పాలెమే కదా, ఫలానా వాళ్ళ అమ్మాయివేనా నువ్వు అంది.

"అవునండీ, మీరెవరూ? గుర్తు రావడం లేదు".

"మల్లికార్జున వాళ్ళ అక్కనమ్మా. నా పేరు కరుణ. మీ అమ్మకి నేను బాగా తెలుసులే. నువ్వు కూడా ఎప్పుడో చూసుంటావ్ కాని గుర్తు పట్టలేదనుకుంటా. ఇక్కడున్నావేమిటీ, ఎవరినైనా చూడటానికి వచ్చావా?" ఆరాగా అడిగింది.

"డాక్టర్ దగ్గరికి వెళ్తొస్తాను. మీరు పైకి పదండి, తర్వాతొచ్చి కలుస్తా!" అని ముందుకు సాగాను. కింద అంతస్తులో రౌండ్స్ చేస్తూ కనిపించిన డాక్టర్‌ని చూసి వెనక్కి తిరిగాను .

రూమ్ కొచ్చేసరికి ఎదురు రూమ్‌లో నుంచి గట్టి గట్టిగా ఏడుపులు వినిపిస్తున్నాయి. మెట్లమీద ఎదురైనామె అడిగిన రూమ్ నంబర్ ఇదే కదా అనుకుంటూ ఆగి చూశాను. బెడ్‌పై నున్న మల్లికార్జునను గుర్తుపట్టాను. ఊర్లో కనబడినప్పుడల్లా 'అమ్మాయ్ బాగున్నావా? పిల్లలెంతమంది? బాగా చదువుకుంటున్నారా' అని నోరారా

పలకరించేవాడు. ఆమె మల్లికార్జున పక్కన కూర్చుని చేయి పట్టుకుని "గద్దొచ్చి కోడిపిల్లలని తన్నుకెళ్ళినట్లు ఇప్పటికే అమ్మని, నాన్నని, చిన్నోడిని రోగం తన్నుకెళ్లింది. ఈ క్యాన్సర్ మహమ్మారి ఇప్పుడు నీ పాలిట పడిందేమిటిరా తమ్ముడూ! హాస్పిటల్‌లో ఉన్నావన్న సంగతి తెలిసిందగ్గర్నుండి కడుపులో నుండి దుఃఖం దేవుకొస్తోంది" అంటోంది.

చూస్తున్న నాకే కాదు అక్కడున్న అందరికీ హృదయం ద్రవించింది. కళ్ళ నీళ్ళు కారిపోతుండగా ముఖం తిప్పుకున్నాను. నన్ను చూసి మల్లికార్జున "నువ్వేంటమ్మా ఇక్కడ?" అన్నాడు.

"మావారికి బాగోలేదు. ఎదురుగా ఉన్న రూమ్‌లోనే ఉన్నాం" అన్జెప్పి బయటికి వచ్చేశాను. "ఎంత ఖర్చయినా నిన్ను కాపాడుకుంటాం మల్లికార్జునా. నువ్వు దిగులు పెట్టుకోబాక. మీ బావ ఎన్ని లక్షలైనా వెనకాడొద్దు, మంచి మందులు వాడమను అని చెప్పాడు" అంటున్న ఆమె మాటలు వినిపిస్తూనే ఉన్నాయి.

కాసేపటి తర్వాత "లంగ్స్‌కి హోల్ వేయాలి మీరు కాసేపు బయటకెళ్ళి వెయిట్ చేయండి" అంటూ డాక్టర్స్ బయటకి పంపిస్తే గ్లాస్ విండో పక్కన నిలబడి మలికార్జున ఉన్న రూమ్ వైపు చూశాను.

మల్లికార్జున బెడ్ పక్కనే నిలబడి "ఇదిగో.. నీకిష్టమని బీరకాయ పచ్చడి, ఎండురొయ్యలేసి రాములక్కాయ కూర తెచ్చా. లేచి రెండు ముద్దలు తిను" అంటూ తమ్ముడిని కూర్చోపెట్టి ముద్దలు తినిపించసాగింది. బయటికొచ్చి మంచి నీళ్ళు పట్టుకుంటున్న మల్లికార్జున భార్యతో "ఆ అక్కా తమ్ముడి ప్రేమ చూస్తుంటే ఆశ్చర్యంగా ఉంది, ఇలాంటి ప్రేమలు చూసి చాలా కాలమైంది" అన్నాను.

కరుణక్కని మెచ్చుకోవడం సుతరాం ఇష్టం లేదన్నట్లుగా ముఖంపెట్టి "ఏదో తమ్ముడికి బాగోపోయేసరికి మా ఆడపడుచు ఇట్టా మాట్లాడుతోంది కానీ మొన్నటిదాకా మా మీద కేసులేసి కోర్టుల చుట్టూ తిప్పిన మనిషామె" అంది కాస్త కోపంగా.

"కష్టాలొచ్చేదాకా మనవాళ్ళు ఎవరో పరాయివాళ్ళు ఎవరో తెలియదంట. ఇప్పుడంతా నేను నా కుటుంబం బాగుంటే చాలు అన్నట్టు ఉంటున్నారు. అందుకే మీ వాళ్ళ ప్రేమాభిమానాలు చూస్తే ముచ్చటేసింది" అన్నాను.

మూతి తిప్పుకుంటూ రాజేశ్వరి లోపలికి వెళ్ళగానే కరుణక్క బయటకొచ్చి "లోపలికి రామ్మా! ఎంతసేపని బయట నిలబడతావ్" అంది.

"ఇప్పుడు కూడా వ్యవసాయం చేస్తున్నారా?" యధాలాపంగానే అడిగా.

గట్టు తెగిన ప్రవాహంలా ఆవేదన పోటీపడి వెలువడింది ఇద్దరు ఆడవాళ్ళ గొంతుల నుండీ.

"ఆడికి నిద్దరలేవగానే పొలంలోకి పోకపోతే తోచదు. ఎప్పుడు దొండ పందిళ్ళు వేద్దామా, ఎప్పుడు కాకరకాయలు తెంపుదామా, జామతోటలో కలుపు తీసేద్దామా అన్నట్టు ఉండేవాడు. ఏడాది నుండి పొలానికి వెళ్ళక కాలు చేయి పడిపోయినట్లే ఉంది. తాత ముత్తాతల నుండి వచ్చిన భూమి గందా, ఇట్టా రుణం తీరిపోయిందేమిటీ అని దిగులు" చెంగుతో కళ్ళు తుడుచుకుంది కరుణక్క.

"పొద్దున్నే యేరు దాటి అటు అడ్డరోడ్డుకో, వన్ టౌన్‌కో గంపెడు జామకాయలేసుకెళ్ళి సాయంత్రానికి ఐదారొందలు సంపాదించుకొచ్చేవాడు. అయ్యన్నీ పోయె. ఈ మాయదారి రాజధాని ఎప్పుడయ్యేను, ఏమొచ్చేను! పాడి పోయె, పంటలూ పోయె, ఎప్పుడో 20 అంతస్తుల మిద్దెలు కడతారని, ఐదు నక్షత్రాల హోటళ్లు కడతారని కలలు కనడమే సరిపోయె.

**"పొద్దున్నే యేరు దాటి అటు అడ్డరోడ్డుకో, వన్ టౌన్‌కో గంపెడు జామకాయలేసుకెళ్ళి సాయంత్రానికి ఐదారొందలు సంపాదించుకొచ్చేవాడు. అయ్యన్నీ పోయె. ఈ మాయదారి రాజధాని ఎప్పుడయ్యేను, ఏమొచ్చేను! పాడి పోయె, పంటలూ పోయె, ఎప్పుడో 20 అంతస్తుల మిద్దెలు కడతారని, ఐదు నక్షత్రాల హోటళ్లు కడతారని కలలు కనడమే సరిపోయె..."**

అయ్యన్నీ మనకెందుకు వాటిల్లో పుట్టామా పెరిగామా? కాసిని పచ్చడి మెతుకులు తిని భూదేవి ఒళ్ళో తుండు గుడ్డేసుకుని ఒడ్డిగిల్లితే చాలు ... కలతలు లేని నిద్ర కళ్ళమీద నాట్యం చేసి పోయేది. ఇప్పుడు చూడు ఎన్ని దిగుళ్ళో! పెట్టుబడులకని, రోగాలకని, పిల్లల చదువులకని చానా అప్పులు చేశాము. ఆ అప్పులన్నీ తీరవాలంటూ రైతులకిచ్చే ప్లాట్లు ముందు విడగొట్టాలి. అది ఎప్పటికి జరిగేనో ఏమో అని వాడికి ఒకటే దిగులు. పెద్దదో చిన్నదో బాధలు లేని జీవితం ఉంటదా?, అప్పులయ్యే తీరతయ్యి. పిల్లలు ఎక్కి వస్తే ఎంతలోకి? అని నేను ధైర్యం చెపుతానే ఉన్నా. అయినా పొద్దస్తం ఆలోచన చేసి చేసి రోగం కొని తెచ్చుకున్నాడు. ఒక్క పిల్లకన్నా పెళ్ళి చెయ్యకపోయే, కాలం కర్మం కలిసి రాకపోతే సంసారం రోడ్డున పడుతుంది అంటారే అట్టా అయింది మా పరిస్థితి" రాజేశ్వరి ఏడుస్తుంటే అక్కడ ఉండలేక బయటకొచ్చేశా.

ఒకే ఊరి వాళ్ళం అవడం, రోజూ నా ఫోన్‌లో నుండి ఆన్‌లైన్ కాల్ చేసి అమెరికాలో ఉన్న మూడో పిల్లతో మాట్లాడడం, ఇంటి నుండి వచ్చే క్యారేజీలు పంచుకోవడం వల్ల మా మధ్య అదివరకు లేని సాన్నిహిత్యం పెరిగింది. ముఖ్యంగా కరుణక్క నాకు బాగా నచ్చింది. గొంతు కాస్త పెద్దగా ఉండి ధాటీగా మాట్లాడుతుందన్నమాటే కానీ మనసు వెన్న. ఎద నిండా ప్రేమ నిండిన మనిషి.

"ఆడపిల్లలకి అత్తింట్లో ఎన్ని భోగభాగ్యాలున్నా పుట్టింట్లో పరిస్థితి బాగోలేదంటే ముద్ద కిందకి దిగదమ్మా. ఏదో పొలాల విషయంలో గొడవొచ్చి ఈ మధ్య రాకపోకలు లేవు గానీ వాడంటే నాకు ప్రాణమమ్మా. అమ్మని, నాన్నని అరచేతుల్లో పెట్టుకుని చూసి కడ తేర్చాడు. తమ్ముడి కుటుంబానికి సాయంగా నిలబడ్డాడు. ఇప్పుడు మిత్తవ ముంచుకొచ్చి వాడి బిడ్డలకి అండ లేకుండా చేస్తోంది. కాని ఎవరి ప్రాణం ఎవరికి అడ్డు వేయగలం?" బాధగా అంది కరుణక్క.

విశాఖపట్నంలో మెడిసిన్ చదువుతున్న మల్లికార్జున పెద్దకూతురు హిమజ పది రోజులు సెలవు పెట్టుకుని వచ్చింది. స్వయంగా డాక్టర్స్‌తో మాట్లాడుతూ లేటెస్ట్ ట్రీట్మెంట్‌లు ఏవి వచ్చాయో వెబ్‌లో వెతుక్కుంటూ ఉండేది. మా వారి కేసు ఫైల్ చూసి " చాలా ఆలస్యం అయిపోయిందాంటీ. మీరు, మేము కూడా మంచి హాస్పిటల్‌లో మంచి ట్రీట్మెంట్ ఇప్పిస్తున్నాం కాని రిజల్ట్ ఎలా ఉంటాయో మరి" ముఖంలో ఏ భావం తొణకకుండా జాగ్రత్తగా అంది.

రెండు రోజులు పోయాక "మీ ఆయనకీ వ్యాధి బాగా ముదిరిపోయిందటగా .. నా మేనకోడలు చెప్పింది" అంది కరుణక్క.

"అవునక్కా! అయినా ఏదో ఆశ ఉంటుందిగా. తర్వాతెన్ని డబ్బులున్నా మనుషులు తిరిగి రారు కదా! అందుకే డాక్టర్స్ ఏది చెపితే అది చేస్తున్నాం" అన్నాను.

"అబ్బాయి అమెరికాలో ఉన్నాడంటున్నావుగా, డబ్బులకేమీ ఇబ్బంది ఉండదనుకుంటాలే" అంది రాజేశ్వరి.

బలవంతంగా ఒక నవ్వు నవ్వి ఊరుకున్నాను.

"స్టేజ్ ఫోర్ వాళ్ళకి సర్వైవల్ రేట్ అంతేమీ ఉండదు ఆంటీ! మహా అయితే కొన్ని నెలలు లేదా ఒక సంవత్సరం" అంది హిమజ.

"మరెందుకమ్మా! తెలిసి తెలిసి కూడా డబ్బు ఖర్చుపెడుతున్నాం?" అనడిగా.

"అది అయినవాళ్ళ బలహీనత. దాన్నే

హాస్పిటల్స్ వాళ్ళు క్యాష్ చేసుకుంటారు. వైద్యం వల్ల ప్రయోజనం ఉండదని తెలిసీ లక్షలకి లక్షలు కుమ్మరించడం కూడా ఒక విధమైన మొహమాటమే. ఆ అప్పులన్నీ తీర్చడానికి బతికున్న మనుషులు నానా చావు చస్తారు. అక్కడ ట్రీట్మెంట్ బావుంటుంది, ఇక్కడ ట్రీట్మెంట్ బావుంటుందని సలహాలిచ్చేవారు ఎక్కువైపోయారు. అవన్నీ పట్టించుకోకండి ఆంటీ! నాన్నదయినా, అంకుల్ దయినా ఒకటే స్థితి. మనిషి కన్నా డబ్బు ఎక్కువ కాదు కానీ ఆ డబ్బు సంపాదించడం కూడా అంత సులువేమీ కాదుగా మనలాంటి మధ్యతరగతి వాళ్ళకి" అంది హిమజ.

నిజమే! తండ్రి ట్రీట్మెంట్ కోసం లక్షలకి లక్షలు పంపడానికి నా కొడుకు పడుతున్న పాట్లు తెలుస్తున్నప్పుడు మనసుకి ముల్లు గుచ్చుకున్నట్లు ఉంటుంది నాకు.

సెలవు లేదని హిమజ వెళ్ళిపోతూ "డ్రగ్ మిక్సింగ్ అప్పుడు మీరు వెళ్ళండి ఆంటీ! మనం ఏమరుపాటుగా ఉంటే ఖరీదైన మందులన్నీ మళ్ళీ ఫార్మసీకి వెళ్ళిపోతాయి" అని హెచ్చరించింది.

కీమో ఇస్తున్నప్పుడు రెండుసార్లు మోసం జరిగినట్లు నాకెందుకో ఇంతకు ముందే అనుమానం వచ్చింది. నన్ను పిలవకుండా స్టాఫ్ వెళ్ళి డ్రగ్ మిక్స్ చేయించుకుని తెచ్చేశామని బిల్ చేతిలో పెడుతుండేవారు. హిమజ చెప్పినప్పటి నుండి కీమోథెరపీకి కావాల్సిన మందులన్నీ స్వయంగా నేనే వెళ్ళి తీసుకురావడం మొదలుపెట్టాను. స్టాఫ్ చేతికి ఇవ్వకుండా మందులు మిక్సింగ్ చేసేదాకా అక్కడే ఉండి ఆ బాటిల్స్ పైన పేరు రాసిన లేబిల్ అంటించిన తర్వాతనే బయటకి వచ్చేదాన్ని.

హిమజ వెళ్ళాక తండ్రి దగ్గర ఉండటానికి రెండోపిల్ల మంజు వచ్చింది. ఆ అమ్మాయి ఇక్కడే యూనివర్సిటీలో చదువుతోంది. తల్లి ఇచ్చిన క్యారేజీలను తీసుకుని పన్నెండుకల్లా హాజరయ్యేవాడు కరుణక్క కొడుకు చంద్రశేఖర్. అతనికి పెద్దగా చదువు అబ్బకపోవడం వల్ల తండ్రి మెకానిక్ షెడ్‌లోనే పని చేస్తున్నాడట. పన్నెండేళ్ళ తర్వాత పుట్టిన ఒక్కగానొక్కకొడుకట. అడుగడుగుకి సాయంగా నిలబడేవాడు. చంద్రశేఖర్ వైపు కృతజ్ఞతగా చూసేది మంజు. వరసగా పదిరోజులపాటు చూపు, మాట కలిసేటప్పటికి ఇద్దరి మనసులు కూడా కలిసిపోయినట్లున్నాయి. మంజుని చూడగానే చంద్రశేఖర్ కళ్ళల్లో వెలుగు, అతన్ని చూసినప్పుడల్లా ఆమె బుగ్గల్లో సిగ్గులు, అరనవ్వులు గమనించాను.

ఒకరోజు మా వారు ప్రశాంతంగా నిద్రపోతున్నపుడు మెల్లగా లేచి మల్లికార్జున దగ్గరకి వెళ్ళి కూర్చున్నాను. అతనికి కాస్త ఓపిక వచ్చినట్టుంది. లేచి కూర్చుని బాగానే మాట్లాడుతున్నాడు.

"దసరా పండక్కల్లా రైతులకి ప్లాట్లు విడగొడతారంట" అన్నాను పేపర్లో చదివిన విషయాన్ని గుర్తు చేసుకుని.

జీవం లేని ఓ నవ్వు నవ్వి ఊరుకున్నాడు.

"భవిష్యత్‌లో మంచి విలువ ఉంటుంది మీ భూమికి" అన్నాను.

"దేనికమ్మా విలువ! మనిషికా, భూమికా? వాళ్ళు లాక్కున్నది భూములను మాత్రమేనా? రైతు ఆత్మని చంపేస్తున్నారు. రైతుకి అంతకన్నా వేరే మరణం ఏముందమ్మా! నాయకుల ధనాశకి, అత్యాశకి అంతే లేదు. పేర్లు ఎవరెవరివో కానీ ఒక్కొక్కళ్ళకి వందల ఎకరాలు. ఇంట్లో ఆడాళ్ళ ఒంటినిండా ఏడు వారాల నవరత్నాల ఆభరణాలు. ఇళ్ళని బంగారు, వెండి, వస్తుసామాగ్రితో నింపుకోవడానికి, మోజుపడిన వాహనాలని వరుసలో నిలబెట్టుకోవడానికి, పది తరతరాలు దర్జాగా బతకడానికి సరిపడేంత వెనకేసుకున్నా వారి ధన దాహం తీరేటట్టు లేదు. రైతులు ఇప్పుడు కూడా భూమిని అమ్ముకోవచ్చు అంటారు. భూమిని అమ్ముకుంటే డబ్బులొస్తాయి కానీ ఉన్న ఊళ్ళో భూమి ఉందన్న విలువొస్తుందా? ఇప్పుడు చారెడు భూమి లేని బికారినయిపోయా. నాకెందుకమ్మా లక్షలు? భూమి కావాలి, దున్నుకోవడానికి, పంట వేసుకోవడానికి భూమి కావాలి" ఆవేశంతో ఊగిపోతూ దగ్గొచ్చి ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు మల్లికార్జున.

రాజేశ్వరి గబాల్న లేచి ఒక చేత్తో గుండె మీద రాస్తూ మరో చేత్తో నీళ్ళు తాపిస్తూ "కదిలిస్తే చాలు కడుపులో ఉన్నదంతా కక్కుతావ్. నువ్వొక్కడివే ఇచ్చావా ఏమిటి? అందరూ ఇచ్చారు. ఇవ్వనన్నవాళ్ళని బలవంతం చేసి మరీ ఇప్పించారు. ఆళ్ళందరికి లేని బాధ నీకొక్కడికే ఎందుకయ్యా అంటే ఊరుకోవు" అని కసిరింది. నావైపు తిరిగి "ఇదమ్మా ఈయన బాధ. వచ్చిన్నోళ్ళందరి దగ్గరా ఇదే గోస. ఊరుకోయ్యా అంటే ఊరుకోడు" అంది.

పదెకరాల భూమిని అయినకాడికమ్ముకున్న మాకు మాత్రం తెలియదా భూమి విలువ ఏమిటో. ఏం మాట్లాడగలను? మౌనంగా అక్కడనుండి జారుకున్నాను.

డిశ్చార్జ్ అయి వెళ్ళేముందు మా రూమ్‌కి వచ్చింది రాజేశ్వరి.

"పొద్దున్న చంద్రశేఖర్ వచ్చి చెప్పాడు. మాకందరికీ ప్లాట్‌లు ఒక్క చోటనే వచ్చినాయంట. పట్టాలిచ్చాక అంతా కలిపి మళ్ళీ పొలం చేద్దాం మామయ్యా అన్నాడా పిల్లగాడు. మీ మామయ్య వల్లేమవుతుంది ఎందుకులే అన్నా ఊరుకోలేదు. నేనుండాను కదా అత్తా అన్నాడు. మామ అల్లుడు ఏమి చెయ్యాలనుకున్నారో ఏమిటో?" అంది.

"పోనీలే, ఈ మంచి కబురు విని మీ ఆయన తొందరగా కోలుకుంటాడు. ఆ పిల్లాడు చంద్రశేఖర్ చక్కగా ఉన్నాడు. కష్టం సుఖం బాగా తెలిసినట్లు ఉంది. చదువు, ఉద్యోగం లేకపోతే మాత్రం ఏమైంది? కుటుంబానికి అండగా ఉంటాడు. మీ మంజుని ఇచ్చి చేయండి ఈడు జోడు బాగుంటుంది" అన్నాను.

"మేమూ అదే అనుకుంటున్నాం. పిల్ల కూడా మీ ఇష్టం అంది. అన్నీ బాగుంటే తొందరలోనే పెళ్ళి చేస్తాం. ఫోన్ చేస్తాను .. రండి తప్పకుండా" అంది రాజేశ్వరి.



బంధుత్వాలు బలపడుతుంటే ఎవరికి మాత్రం సంతోషంగా ఉండదు?

తర్వాత నాలుగు రోజులకి మావారిని డిశ్చార్జ్ చేస్తే మేము ఇంటికొచ్చేశాం.

దీపావళి వెళ్ళిన ఐదో రోజున 'మంజుకి, చంద్రశేఖర్‌కి పెళ్ళని, తప్పకుండా రమ్మన'మని ఫోన్ చేసి ఆహ్వానించింది కరుణక్క.

"పొలెంకి దగ్గరలోనే ప్లాట్లు ఇచ్చారమ్మా. ప్లాట్లన్నీ కలిపి దున్నేసి చుట్టూ ఇనుపకంచె వేశాం. అక్కడే పెళ్ళి చేయాలని తమ్ముడి కోరిక. ఉదయాన్నే తొమ్మిదింటికి ముహూర్తం. డబ్బుది ఏముందిలే బుజ్జమ్మా. అన్ని ఖర్చులు నేనే పెడుతున్నా. కోడలికి నగలు, చీరలు ఏమీ తక్కువజేయలేదు. మాకు మాత్రం ముద్దు ముచ్చట తీరొద్దా! తమ్ముడు కూడా ఒక్క బిడ్డ పెళ్ళైనా కళ్ళారా చూసుకుంటాడని తొందరపడుతున్నా" అంది.

మావారికి కూడా కాస్త తేలిగ్గా ఉండటంతో పెళ్ళికి వెళ్ళాం. పచ్చని పందిరి కింద పూలతో వేదికని అందంగా అలంకరించారు. వేదిక వెనుక షామియానా వేసి విందుకి ఏర్పాట్లు చేశారు. ఆహ్వానానికి, ఆతిథ్యానికి లోటేమీ లేకుండా చూసుకునే

బంధుమిత్రులు అడుగడుగునా కనిపించారు. చంద్రశేఖర్, మంజు చాలా సంతోషంగా కనిపించారు. మమ్మల్ని చూసి "పెళ్ళవగానే వెళ్ళిపోవద్దాంటీ! వెనక భూమంతా తోట వేయ డానికి తయారు చేసిపెట్టాం. మీరెళ్ళి చూసి రండి" అన్నారు.

నేను, మా వారు ఆసక్తిగా వెనుక వైపుకి వెళ్ళి చూశాం. అక్కడ భూమంతా పదునుగా దున్ని కొత్తగా చాలు వేశారు. నర్సరీ నుండి తెప్పించిన జామ మొక్కలని సాలులో నాటడానికన్నట్లు దూరం దూరంగా వేసి ఉంచారు. అప్పుడు నా మదిలో ఒక ఊహాచిత్రం మెదిలింది. ఆకాశ హర్మ్యాల మధ్య ఒక పచ్చని జామతోట. ఆ తోటని ఇష్టంగా సాగుచేసుకుని పండిన పంటను చూసి మురిసిపోతున్న మల్లికార్జున రూపం కదలాడింది. మేనమామ మనసెరిగి నడుస్తున్న చంద్రశేఖర్‌పై తెలియని వాత్సల్యం పుట్టుకొచ్చింది. పదిన్నరకల్లా పెళ్లి తంతు ముగిసింది. తర్వాత మొక్కలు నాటే కార్యక్రమం మొదలైంది. తలా ఒక మొక్క నాటేంత భూమి అక్కడ లేదు గాని, మొక్క నాటలేనివారు నాటిన మొక్కలకి నీరు పోసి సంతృప్తిపడ్డారు.

మొక్కల మొదళ్ళ దగ్గర మట్టిని సరిచేస్తూ నెమ్మదిగా నడుస్తున్న మల్లికార్జున కనిపిస్తే ఆగాం.

"ఎలా ఉందండీ బావగారూ" అని మావారిని పలకరించాడు.

"ఇప్పటికి బాగానే ఉంది, తర్వాత ఎలా ఉంటుందో చెప్పలేం" అని ఈయన నవ్వుతూ జవాబిచ్చారు.

"లేడి కాళ్ళు లేక చిక్కలేదు - కాలం వచ్చి చిక్కింది అన్నట్టు రోగం చేతికి చిక్కాం మనం" అన్నాడు మల్లికార్జున.

ఆ మాటా ఈ మాటా మాట్లాడుతూ అందరం కలిసి నడుస్తుండగా ఆ చిన్నపాటి శ్రమకే అలసిపోయినట్లయి మల్లికార్జున తోటలో కూర్చుండిపోయాడు. ఎవరో మంచి నీళ్ళ సీసా అందించారు. గాలి తగిలితే సేద తీరతాడని నా చేతిలోని న్యూస్ పేపర్‌తో విసరసాగాను.

"అమ్మాయ్! నేను విసురుకుంటానులే ఇటియ్యమ్మా" అంటూ పేపర్ తీసుకుని నెమ్మదిగా విసురుకుంటూ కాస్త ఆగి అందులో ఉన్న హెడ్‌లైన్ చూసి పేపర్‌ని కోపంగా విసిరి కొట్టాడు. "ఈ దాహం .. ఈ భూదాహం తీరడానికి మందే లేదు" అంటూ ఆవేశంతో ఊగిపోయాడు.

కంగారుగా కింద పడిన పేపర్ అందుకుని వెడల్పు చేసి చూశాను. 'కొత్త పరిశ్రమల కోసం వెయ్యి ఎకరాల భూసేకరణ' అన్న హెడ్‌లైన్ కనిపించింది.

"అంత ఆవేశమెందుకు? ప్రభుత్వం తీసుకునే ప్రతి నిర్ణయాన్ని అంత అనుమానించాల్సిన పని లేదు. పరిశ్రమలు వస్తే మంచిదేగా, పిల్లలు విమానాలెక్కడం మానేసి ఇక్కడే ఉద్యోగాలు చేసుకుంటారు. ఇతర దేశాలను అభివృద్ధి చేసే బదులు మన దేశమే అభివృద్ధి చెందుతుంది" అన్నాను.

"ఇట్టా పోర్ట్‌లకి ఎయిర్ పోర్ట్‌లకి, పరిశ్రమలకి, ఇళ్ళకి అన్నిటికీ పంటభూములనే లాక్కోవాలా? కావాలంటే భూమి ఎక్కడ లేదు? పచ్చగా పంట పండే పొలాల్లో పరిశ్రమలు పెడితే ఏం తింటాం, మట్టి తింటామా? మట్టి కూడా మిగలనిస్తున్నారా" అంటూ రెండు పిడికిళ్ళలోకి మట్టిని తీసుకుని "ఈ మనుషులకి దాహం ఎక్కువైపోయింది, ధనదాహం ఎక్కువైపోయింది, భూదాహం ఎక్కువైపోయింది ... క్యాన్సర్ కన్నా మందు ఉందేమో కానీ ఈ ధనదాహానికి, భూదాహానికి మందే లేదు" అని గొణుక్కుంటూ వెనక్కి వాలిపోయాడు మల్లికార్జున.

అతని చుట్టూ అయినవాళ్ళు అల్లుకుంటే నా చుట్టూ అంతులేని ఆలోచనలు. అభివృద్ధి అంటే వనరుల విధ్వంసమేనా? అభివృద్ధి పేరిట జరుగుతుంది మోసమేనా, భూదాహమేనా? నాకూ ప్రశ్నల దాహం పట్టుకుంది. జవాబులిచ్చి దప్పికెవరు తీరుస్తారిప్పుడు?

రచయిత్రి సెల్ : 99859 81666

# కర్రలా... కళాకృతులా?



**చే**తికర్రకు చాంతాడంత చరిత్ర ఉంది. జానపదాల్లో మాంత్రికుడి చేతిలో మంత్ర దండంలా మారి మాయలు చేసింది అదే! రాజగురువుల దగ్గర రాజదండంలా గంభీరతను ఒలకబోసిందీ అదే! ఆ మాటకొస్తే పంటకాపు చేతిలో మువ్వల శబ్దం చేస్తూ మురిపించిందీ అదే. ఆధునిక యుగంలోనూ ముసలాళ్లకు మూడోకాలుగా ఊతమిచ్చే ఈ చేతికర్ర ఇప్పుడు తొలిసారి రంగుల్లో ముస్తాబై కొత్త పెళ్లికూతురిలా మెరిసిపోతోంది. దానికి కారణం బ్రహ్మయ్య. ఎవరా బ్రహ్మయ్య? ఏమతని కథ?

కాఫీ పంటను సాగుచేసే కుటుంబంలో పుట్టాడు బ్రహ్మయ్య. ప్రకృతి రమణీయతకు చిరునామా అయిన కూర్గ్‌లో తోటల్లో, లోయల్లో స్వేచ్ఛగా షికారు చేసేవాడు. అది చూసి కూర్గ్‌లోని ఓ గిరిజన యువకుడు అడవుల్లో సంచరించేటపుడు పనికొస్తుందని ఓ కర్రని బ్రహ్మయ్యకి బహుమతిగా ఇచ్చాడట. ఆ కర్ర... జర్నలిజంలో డిగ్రీ చేసిన బ్రహ్మయ్యలో కొత్త ఆలోచనలను పాదు కొల్పింది. దాని ఫలితమ్ 'భీమ్ స్టిక్స్'. కేవలం చేతికర్రలను మాత్రమే అమ్మే చిన్న షాపది.

చేతికర్రల కోసం ప్రత్యేకంగా షాపా? అని ఆశ్చర్యపోకండి. బెంగళూరులోని ఇందిరానగర్ మెయిన్‌రోడ్డులో ఉన్న ఆ షాపులోకి ఒకసారి తొంగి చూస్తే చేతికర్రలకు ప్రత్యేకంగా షాపు ఎందుకో మీకే అర్థమవుతుంది. రకరకాల సైజుల్లో రంగురంగుల చేతికర్రలు అక్కడ మీకు కనువిందు చేస్తాయి. ఒక్కో కర్రా ఒక్కో ప్రయోజనానికి ఉద్దేశించినది. ట్రెక్కింగ్‌కి ఉపయోగించేవి, నీటిలో నడవడానికి ఉపయోగించేవి, పొలంగట్లపై నడవడానికి ఉపయోగించేవి, చిన్న చిన్న మూటలను కట్టుకోవడానికి ఉపయోగించేవి... వీటితో పాటు సాధారణ చేతికర్రలు కూడా ఎన్నో ఉన్నాయి. కొన్ని కర్రలకు చివర విజిల్ కూడా ఉంటుంది. వీటి ఖరీదు 500 నుంచి 12 వేల వరకూ ఉంటుందంటే నమ్ముతారా!



పశ్చిమ కనుమల్లోని వర్షారణ్యాల్లో ఈ చేతికర్రల తయారీకి కావాల్సిన ముడిసరుకు దొరుకుతుంది. ముఖ్యంగా మడికెరిలో వేసవి సమయం ఈ కర్రలను సేకరించడానికి అనువైనదంటాడు బ్రహ్మయ్య. తయారీకి అనువైన కొమ్మల్ని, రెమ్మల్ని సేకరించి ఎండబెట్టి శుభ్రం చేస్తారు. తర్వాత ఆ కొమ్మల్ని చేతికర్రల ఆకారంలో మలుచుతారు. కొన్ని కొమ్మలు సహజసిద్ధంగా కర్ర ఆకారాన్ని కలిగి ఉంటాయి. కొన్నిటిని పచ్చిగా ఉన్నపుడే వంచి సిద్ధం చేస్తారు. తర్వాత వాటిని పెయింట్ వేయడానికి ఆర్టిస్టులకు అందజేస్తారు. వాటి మీద డిజైన్లను చూస్తే... ప్రతి కర్రా ఒక కథ చెప్తున్నట్టు అనిపిస్తుంది. వీటిని చూస్తే కర్రలా... కళాకృతులా అనే సందేహం కూడా తప్పకుండా కలుగుతుంది. ■

## ఇవీ వచ్చాయి

**విదేశీ యాత్రికులు అందించిన మన చరిత్ర**
**రచన :** టి. వెంకట్రావ్
**పేజీలు :** 192, **వెల :** రూ.130
**ప్రతులకు :** నవచేతన బుక్‌హౌస్

**యాత్రాదీపిక - 7**
(మెదక్ పరిసర ఆలయాలు)
**రచన :** పి.ఎస్.ఎమ్. లక్ష్మి
**పేజీలు :** 104, **వెల :** రూ.50
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

**స్కూటర్లపై రోహతాంగ్ యాత్ర**
**రచన :** దాసరి అమరేంద్ర
**పేజీలు :** 94, **వెల :** రూ.100

**తెలంగాణ దారిదీపాలు**

**శ్రీరంగరాయ జీవితం**
**రచన :** ఆదిరాజు వీరభద్రరావు
**పేజీలు :** 38, **వెల :** రూ.30

**రాజా నాయని వేంకట రంగారావు బహద్దరు**
**రచన :** కేశవపంతుల నరసింహ శాస్త్రి, ఆచార్య తూమాటి దొణప్ప
**పేజీలు :** 38, **వెల :** రూ.30

**శేషాద్రి రమణ కవుల జీవితం**
**రచన :** డా. బి. రామరాజు
**పేజీలు :** 32, **వెల :** రూ.30
**ప్రతులకు :** నవచేతన, విశాలాంధ్ర

**తెలుగు భాషకు ప్రాచీన హోదా - విహంగ వీక్షణం**
**సం. :** తిరునగరి భాస్కర్
**పేజీలు :** 192, **వెల :** రూ.120
**ప్రతులకు :** 99626 92662

**శూద్రులకు సుద్దులు**
(మీ గతమిది, మీ మతమేది)
**రచన :** శ్రీ పెందుర్తి శంకరరావు
**పేజీలు :** 68, **ప్రతులకు :** sudrulakusuddulu@gmail.com

**ప్రేమ్‌చంద్** (సాహిత్యం... పరిశీలన)
**రచన :** వలేటి వెంకటేశ్వర్లు
**పేజీలు :** 32, **వెల :** రూ.50
**ప్రతులకు :** 96763 43468

**ఆణిముత్యాలు**
**రచన:** సముద్రాల శఠగోపాచార్యులు
**పేజీలు :** 118, **వెల :** రూ.120
**ప్రతులకు :** 73968 37802

## కొత్త పుస్తకాలు

# మంచిని పెం(పం)చే కథలు

**మం**చి కథ ఉత్తినే ఊడిపడదు. రచయితకి జీవితం పట్ల సునిశిత పరిశీలన, నిర్దిష్టమైన అవగాహన ఉంటే మంచి కథలు పుట్టుకొస్తాయి. అలా పుట్టుకొచ్చిన కథలివి. అందులోనూ 'నెమలినార' ప్రత్యేకమైన కథ. ప్రకృతి వైద్యం చేసే నారాయణయ్య జీవితాన్ని ఆవిష్కరించిన తీరు పాఠకుడ్ని కట్టిపడేస్తుంది. మానవతా దృక్పథంతో పశువులకు, మనుషులకు వచ్చే రోగాలను నయం చేయడానికి ఇంటి ముందు పెంచుకున్న మూలికా వైద్యానికి పనికొచ్చే చెట్లను ఆస్తి పంపకాల్లో తన కొడుకులు నరికివేయడం .. చివరికి ఆ చెట్లే వాళ్ల జీవికకు ఆధారమవడమనేది కథాంశం. వృక్షో రక్షతి రక్షితః! పర్యావరణాన్ని కాపాడినప్పుడే అది మనల్ని కాపాడగలదని చెప్పకనే చెప్పిన మంచి కథ. తనకు తానుగా శారీరక సుఖాన్ని అందించిన ఒక స్త్రీ పట్ల చులకన భావం ఏర్పరచుకున్న మగవాడి వక్రబుద్ధిని పారదర్శకంగా చూపిన కథ 'కొత్త నిర్వచనం'. అంతే కాదు, అలాంటివాడికి చెంప పగిలేలా ఎలాంటి జవాబివ్వాలో కూడా మంజుల పాత్ర ద్వారా చెప్పించారు రచయిత. 'డాడీ, నీ జీవితంలో బెస్ట్ ఫ్రెండ్ ఎవరంటూ హఠాత్తుగా కూతురు అడిగిన ప్రశ్నకు సందిగ్ధావస్థలో పడ్డ ఒక తండ్రి కథ 'మై బెస్ట్ ఫ్రెండ్'. ఆ తండ్రిలోనే కాదు, పాఠకుల్లో సైతం తమ బెస్ట్ ఫ్రెండ్ ఎవరనే ఆలోచన రేకెత్తించే కథ ఇది. 'అడవి పువ్వు', 'సద్దుల బండ', 'మా అడివి మాకియ్యండ్రి' వంటి పలు కథల్లో అవసరాన్ని బట్టి చక్కటి గ్రామీణ మాండలికాన్ని వాడుతూ, మహారాష్ట్ర సరిహద్దు జిల్లా ఆదిలాబాదు ప్రజల ఆచార వ్యవహారాలు, పలుకుబళ్లు, ఆహార్యం, గిరిజనుల వెనకబాటుతనాన్ని దోచుకునే అధికారుల దాష్టీకం వగైరా ... ఎన్నో అంశాలను స్పృశించి రక్తి కట్టించారు. చదివిన డిగ్రీలకన్నా ఒక మంచి కథ మనిషి జీవితాన్ని ఫలవంతం చేయగలదనే ఆశ గలిగిన మురళీధర్ ఆ దిశగానే కథలు రాసి మెప్పించగలగడం అభినందనీయం.

**- తహిరో**

**నెమలినార**, బి. మురళీధర్
**పేజీలు :** 220, **వెల :** రూ. 150, **ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు




# ఆత్రేయ నాటకాలపై సమగ్ర పరిశీలన

**'ఆ**త్రేయ నాటక సాహిత్యం గురించి ఆయనకంటే నాకే ఎక్కువ తెలుసని ఆయన బ్రతికుండగా ఆత్రేయగారితోనే అనేవాణ్ణి.'

'ఆత్రేయ గురించి ఎన్నో పుస్తకాలు వెలువడిన తర్వాత, ఎంతో పరిశోధన జరిగిన తర్వాత కూడా ఆయన నాటక సాహిత్యంపై మరో రచన అవసరమా? అని కొందరికి సందేహం రావచ్చు. ఔను అవసరమే!'

'ఆత్రేయ నాటక సాహిత్యంపై వచ్చిన అపవ్యాఖ్యలను, అసత్యాలను ఖండిస్తూ, ఎత్తిపోతల (ఉ)పరిశోధనల్ని నిరసిస్తూ ఒక నిర్దుష్టమైన, సమగ్రమైన పుస్తకాన్ని వెలువరించాలనే తపన ఈ రచనకు ప్రేరణ'.

స్వయంగా రచయిత ఎంతో ఆత్మవిశ్వాసంతో చేసిన ఈ వ్యాఖ్యలు ఈ పుస్తక విశిష్టతకు నిదర్శనాలు. నిజాయితీగా తన పుస్తకంతో సహా (ఎం.ఫిల్ సిద్ధాంత వ్యాసం) ఇంతవరకు ఆత్రేయ నాటక సాహిత్యంపై వచ్చిన వ్యాసాలు, పుస్తకాలలోని పొరపాట్లన్నిటినీ ఎత్తిచూపి సత్యాలను ఆవిష్కరించడం, ఆత్రేయ రచనల్ని నిష్పాక్షికంగా విశ్లేషించడం, అనుబంధాలలో ఆత్రేయ వ్యక్తిగత విషయాలకు సంబంధించిన ఇంటర్వ్యూలను, లేఖలను జతచేయడం ఈ పరిశోధన గ్రంథం ప్రత్యేకత.

జీవితరంగం, పూర్వరంగం, నలభైల నాటి నాటకరంగం, నాటక దశకం, నాటికా పంచదశి, ఆధునికాంధ్ర నాటకరంగం - ఆచార్య ఆత్రేయ అనే ఆరు ప్రకరణాలున్న ఈ పుస్తకం ఆత్రేయ సమగ్ర నాటక రచనల సమాచారానికి దర్పణం. అన్నట్టు దీనికి నాటక రంగంపై ఉత్తమ గ్రంథంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి నంది పురస్కారం కూడా లభించింది (2015). నాటక సాహిత్యప్రియులు అవశ్యం కొని దాచుకొనదగిన సత్యనిష్ఠతో సాగిన అరుదైన పుస్తకం.

**- జయం**

**ఆత్రేయ నాటక ప్రస్థానం**, పైడిపాల
**పేజీలు :** 176, **వెల :** రూ.130, **ప్రతులకు :** డా. పి.యస్. రెడ్డి, 99891 06162

# డిస్క్ సమస్యలకు సర్జరీ దాకా ఎందుకు?

**శరీరానికి** వెన్నెముక మూలస్తంభంలాగా పనిచేస్తుంది. వెన్నెముకకు తోడుగా కండరాలు, లిగమెంట్లు, డిస్క్‌లుంటాయి. వెన్నెముక సులభంగా వంగడానికి డిస్క్‌లు, లిగమెంట్లు తోడ్పడతాయి. ఈ వెన్నుపూసల మధ్య రబ్బరు కుదురులాంటి ఒకపదార్థం ఉంటుంది. దీనిని డిస్క్ అంటారు. వెన్నుపాము పొడవునా ఎన్నో నరాలు వెళుతుంటాయి. మెడభాగం నుంచి వెళ్లే నరాలు చేతుల్లోకి, నడుము నుంచి వెళ్లే నరాలు కాళ్లలోకి వెళతాయి. వీటిలో కొన్ని నరాలు మూత్రకోశం, మలవిసర్జన భాగంతో పాటు లైంగిక భాగాల్లోకి వెళతాయి. అందుకే డిస్క్ సమస్యలు కలిగి ఉన్న వారిలో అంగస్తంభన, శీఘ్రస్ఖలనం వంటి లైంగికపరమైన సమస్యలు కనిపిస్తాయి. డిస్క్‌లు వెన్నెముక కదులుతున్నప్పుడు షాక్ అబ్జార్బర్‌లా పనిచేస్తాయి. సాధారణంగా డిస్క్‌లలో రెండు రకాల సమస్యలు ఉత్పన్నమవుతుంటాయి. ఒకటి డిస్క్‌ప్రొలాప్స్, రెండవది డిస్క్ డిజనరేటివ్ డిసీజ్. డిస్క్ బయట ఉన్న పొర బలహీనపడటం వల్ల డిస్క్ వెనక్కు జరిగి కాళ్లలోకి వచ్చే నరాలపై ఒత్తిడి తెస్తాయి. ఏ ప్రాంతంలో నరాలపై ఒత్తిడి పడితే ఆ ప్రాంతంలో తిమ్మిర్లు, మొద్దుబారడం, మంటగా అనిపించడం జరుగుతుంది. దీనినే స్లిప్ డిస్క్ అంటారు. ఒక్కొక్కసారి యాన్యులస్ అనే పొర చిట్లి, జెల్లీలాంటి డిస్క్ మెటీరియల్ బయటకు వస్తుంది. దీన్ని డిస్క్ ప్రొలాప్స్ అంటారు. దీనివల్ల కాళ్లలో నొప్పి, నడుము నొప్పి వస్తుంది. కాలును వంచకుండా తిన్నగా ఉంచి పైకి ఎత్తినపుడు కాలులో నొప్పి పెరిగితే డిస్క్ ప్రొలాప్స్‌గా చెప్పవచ్చు.

### సెర్వికల్ స్పాండిలోసిస్

మెడభాగంలో ఉండే పూసలను సెర్వికల్ వర్టిబ్రా అంటారు. ఈ వర్టిబ్రాల మధ్య ఉన్న డిస్క్ అరిగి కొంచెం పక్కకు జరిగి అక్కడ ఉన్న నాడులను ఒత్తిడికి గురిచేస్తుంది. దీనివల్ల మెడనొప్పి వస్తుంది. మెడనొప్పి రావడానికి గల కారణాలను పరిశీలిస్తే మెడ కండరాలు ఒత్తిడికి లోనుకావడం, సెర్వికల్ స్పాండిలోసిస్, సెర్వికల్ డిస్క్ ప్రొలాప్స్, సెర్వికల్ ఫ్రాక్చర్స్, టీబీ వల్ల ఎముకల్లో మార్పులు, సరియైన భంగిమలో కూర్చోకపోవడం, ఎక్కువ బరువులు ఎత్తడం వంటి కారణాల వల్ల ఈ సమస్య రావడానికి ఆస్కారం ఉంటుంది. దీనివల్ల సీ1, సీ2, సీ3, సీ4, సీ5, సీ6, సీ7 వర్టిబ్రాలలో సమస్యలు వస్తాయి. ఈ డిస్కులలో సమస్యల వల్ల తలనొప్పి, మెడనొప్పి, మెడబిగుసుకుపోవడం, చేతుల్లో కాళ్లలో తిమ్మిర్లు, స్పర్శ తగ్గడం, మల, మూత్రవిసర్జనపై నియంత్రణ తప్పడం, మెడ కండరాలు బలహీనపడటం వంటి లక్షణాలు కనిపిస్తాయి.

### కారణాలు

డిస్క్ సమస్యలు రావడానికి అధిక బరువు, జీవనవిధానంలో మార్పులు వయసు పైబడటం వల్ల వచ్చే మార్పులు, శక్తికి మించి బరువులు ఎత్తడం, ఎక్కువ దూరం రన్నింగ్ చేయడం, రోజంతా వంగి పనిచేయడం, వెన్నెముకకు దెబ్బలు తగలడం, వాహనంపై వెళుతున్నప్పుడు గోతుల్లో పడి డిస్కులపై ఒత్తిడి పెరగడం కారణాలుగా ఉంటాయి.

### సయాటికా

సయాటికా అనేది శరీరంలో అతి పొడవైన నరం. ఇది తొడల నుంచి మోకాళ్లు, కాలివేళ్ల దాకా వ్యాపించి ఉంటుంది. దైనందిన జీవితంలోని లోపాల వల్ల ఈ నరం ఒత్తిడికి గురవుతుంది. దీనివల్ల నడుం భాగంలో కండరాలు పట్టేసినట్టుగా ఉంటుంది. పొడిచినట్టు నొప్పి ఉండటం వల్ల వంగడం కష్టమవుతుంది. మొద్దుబారినట్టు ఉండటం, కాలుపైకి ఎత్తలేకపోవడం, నడుం కిందిభాగంలో బలహీనత, కాళ్లలో తిమ్మిర్లు రావడం, నడవడం కష్టంగా ఉంటుంది. సయాటికా సమస్య ఉన్న వారికి అంగస్తంభన లోపాలు, లైంగిక సమస్యలతో బాధపడే వారు కూడా ఉన్నారు.


డా. మధు వారణాశి, ఎం.డి
ప్రముఖ హోమియో వైద్యులు
ప్లాట్‌నెం 188, వివేకానందనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైదరాబాద్
ఫోన్ : 8897331110
8886 509 509




### ఎలా వస్తుందంటే...

రోజంతా కూర్చుని, నిలబడి ఉద్యోగాలు చేసే వాళ్లు, అధిక బరువు, ప్రమాదాలకు గురైన వారికి ఈ సయాటికా సమస్య వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. వెన్నెముక సులభంగా వంగడానికి డిస్క్‌లు, లిగమెంట్లు తోడ్పడతాయి. మెడభాగం నుంచి వెళ్లే నరాలు చేతుల్లోకి, నడుము నుంచి వెళ్లే నరాలు కాళ్లలోకి వెళతాయి. సెర్వికల్, లంబార్ రీజియన్లలో డిస్క్‌లు దెబ్బతింటాయి. ఉన్న స్థానం నుంచి పక్కకు తొలగుతాయి. దాని ప్రభావం నెర్వస్‌పైన పడి నొప్పి రావడం మొదలవుతుంది. డిస్క్ దెబ్బతినడం వల్ల మెడభాగంలో సెర్వికల్ స్పాండిలైసిస్ సమస్య మొదలవుతుంది.

**డిస్క్ సమస్యలు మనిషిని నిర్జీవం చేస్తాయి. చాలా మంది వెన్నునొప్పి వేధిస్తున్నా పెయిన్ కిల్లర్స్ వేసుకుని కాలం గడిపేస్తూ ఉంటారు. కానీ డిస్క్ సమస్యలను నిర్లక్ష్యం చేస్తే ఇతర సమస్యలకు దారితీసే అవకాశం ఉంది. అయితే హోమియో చికిత్స ద్వారా డిస్క్ సమస్యలకు శాశ్వత పరిష్కారం లభిస్తుందని అంటున్నారు ప్రముఖ హోమియో వైద్యనిపుణులు, ఉత్తమ డాక్టర్ అవార్డు గ్రహీత డాక్టర్ మధువారణాశి.**

### లక్షణాలు

మెడ నుంచి నొప్పి చేతి వేళ్ల వరకు పాకుతుంది. తల తిరగడం, కండరాలు బిగుసుకుపోవడం, చేతి వేళ్లు తిమ్మిరి ఎక్కడం, పడిపోతున్నట్లుగా ఉండటం, తలనొప్పిగా ఉండటం జరుగుతుంది. లంబార్ స్పాండిలోసిస్‌లో నడుంనొప్పి కిందకు పాకుతున్నట్లు నొప్పి, కాలివేళ్లలో తిమ్మిరిగా ఉంటుంది. వ్యాధి గురించి అవగాహన, మెడిసిన్, పాథాలజీ, అనాటమీల విజ్ఞానం వ్యాధి నిర్ధారణకు ఉపయోగపడుతుంది. ప్రకృతి ఎప్పుడూ సహజంగా ఉంటుంది. అలాంటి ప్రకృతి నియమాలపై హోమియోపతి ఆధారపడింది. హోమియోవైద్యం నానో టెక్నాలజీ సూత్రాల ద్వారా సత్ఫలితాలు ఇస్తుందని తేలింది. చాలా మంది రోగులు వైద్యులను తరచూ మారుస్తుంటారు. హోమియో వైద్యంలో ఇలాంటి మార్పులు చాలా ఇబ్బందులకు గురిచేస్తాయి. సహజత్వం, సత్యం, మానవత అనే మూడు లక్షణాలున్న అనుభవజ్ఞుడైన హోమియో నిపుణుడు దొరికినపుడు అతనిపై ఆధారపడినపుడు మీ అనారోగ్య సమస్యలు చాలా వరకు తగ్గుతాయి. మంచి హోమియో వైద్యుడు రోగి ముఖం చూసిన వెంటనే తన మనసులో మందులు గుర్తుకువస్తాయి. దాన్నే స్పాట్ డయాగ్నసిస్ అంటారు. అది వ్యాధి నిర్ధారణకు తిరుగులేని రామబాణం లాంటిది.

### వ్యాధి నిర్ధారణ

ఎక్స్‌రే, సీటీస్కాన్, ఎమ్ఆర్ఐ స్కాన్, సీబీపీ, సీఎస్ఎఫ్ పరీక్షలు చేయించుకోవడం ద్వారా వ్యాధి నిర్ధారణ చేసుకోవచ్చు.

### హోమియో చికిత్స

హోమియో వైద్య విధానం శాస్త్రీయతతో కూడినది. శస్త్ర చికిత్స అవసరం లేకుండా నయం చేయడానికి ఆస్కారం ఉంటుంది. సర్జరీ అనేది కొన్ని రకాల వ్యాధులకు ఉపయోగించే టెక్నిక్. సర్జరీతో ఆటంకం కలిగించే పదార్థాన్ని నిర్మూలించడానికి ఆస్కారం ఉంటుంది. కానీ వ్యాధి కారకాలను తీసివేయుటకు వీలుకాదు. మిగతా వైద్యవిధానాలలో మందుల ద్వారా నయం కాని వ్యాధులన్నింటికి సర్జరీ పైన ఆధారపడతారు. కాని హోమియో వైద్యంతో 60 శాతం కేసులు సర్జరీ లేకుండా తగ్గించవచ్చు.

